1

# తొలి పలుకు.

"రుక్కుతల్లి" అనే పుస్తకము అఖ్యాయికలలో సరి క్రొత్తది. ఇది కథానికకంటే పెద్దదీ, ఆఖ్యాయికకంటే చిన్నదీ అవుతుంది పరిమాణాన్నిబట్టి. వస్తుగౌరవమునుబట్టీ, రసప్రాముఖ్యాన్నిబట్టీ దీన్ని కథానిక అనటమే యుక్తం.

కర్త ఆంధ్ర పాఠక లోకానికి సుపరిచితుడైన మునిమాణిక్యం. కథావస్తువు గ్రంథకర్త కభిమాన విషయమైన ఆంధ్ర సాంసారిక విషయము. ఈ కథలో కూడా కొంత కాంతం సంబంధం ఉన్నప్పటికీ కాంతం పెద్దకూతురు రుక్కుతల్లి ఇందులో ప్రధానపాత్ర.

ఇందలి కథనపద్ధతి నవీనమైంది. కథకుని ఇంట్లో ఒకనాటి రాత్రి భోజనాలైనపిమ్మట బంధువులూ మిత్రులూ అంతా గూర్చుంటారు. అది రుక్కుతల్లి చనిపోయినదినం. అక్కడ సమకూడినవాళ్లందరూ ఆ మృతజీవి పటము పూవులతో అలంకరించి ఆమె ఉదారాశయాలూ ఉదాత్తవర్తనమూ చెప్పుకొంటూ ఉంటారు. అక్కడ ఉన్నవాళ్లందరూ ఆమెను గూర్చి తలోమాటా చెపుతారు. అన్నీ కలిపి రుక్కుకథ అయింది.

ఈతీరుగా సంభాషణాపద్ధతిని నాటకశైలిని కథలు వ్రాయటం తెలుగులో నవీనమైనది. ఈ క్రొత్తపద్ధతి పాఠకులకు ఆకర్షకంగా ఉంటుంది. బహుపాత్రల కంఠస్వరాలూ

మనోభావాలూ అనుకరించి అభినయింపగల నటుడు ఒకడు ప్రదర్శించటానికికూడా ఇది అనువైనది. నలుగురూ కబుర్లు చెప్పుకుంటూ కథ పరిసమాప్తి చెయ్యటానికి రెండున్నర గంటలు పట్టవచ్చు.

మునిమాణిక్యం కథలు చాలావరకు హాస్యరసమే ప్రధానంగా కలవి. కాంతం ప్రసక్తి వచ్చినప్పుడు కొంత శృంగార సమ్మేళనంకూడా కలగటం కద్దు. మానవస్వభావము చపలత్వమూ, స్త్రీబుద్ధి నైశిత్యమూ, ఉపాధ్యాయ వృత్తిలోని కష్టసుఖములూ ఈయన కథలలో తఱచుగా కన్పించే విషయాలు. ఏ విషయమైనప్పటికి ఒకరకపు హాస్య ధోరణిలోకి దింపటం ఈయనకు అలవాటు.

ఈ కథలో ఈయన హాస్యశృంగారములతో ప్రసక్తి లేని వస్తువు స్వీకరించటంలోనే ఇందలి నవ్యత వ్యక్తమైంది. తిరుమాళిగలో పరివర్తనాభిముఖమైన ఈయన దృక్పథం ఇందులో పూర్తిగా మారిపోయిందని చెప్పవచ్చు. సీరియస్‌గా ఉండికూడా పాఠకులను రంజింపచేయుటానికి ఇందులో ఈయన ప్రయత్నించినట్లు స్పష్టమైనది. ఈ ప్రయత్నఫలమే ఈ విషాద గాథ.

విషాదగాథలు వ్రాయటం తెలుగువారి కలవాటులేదు. ఒకవేళ ఉన్నప్పటికీ అవి ఉపాఖ్యానాలుగా ఇతిహాసాలలోనో పురాణాలలోనో ఉండటమేతప్ప జనసామాన్యమునకు సంబంధించిన విషాదగాథలు లేవు. ఈ విషాదగాథ నవ్యులు పాశ్చాత్య వాఙ్మయ సంపర్కమువల్ల మన వాఙ్మయంలో సృష్టిచేస్తున్న క్రొత్త సరుకు.

విషాదగాథ అవటంచేత ఇది కరుణరసప్రధానమైనది. ఉదారగుణమూ, ఉన్నతాదర్శమూ, ఉదాత్తవర్తనమూ కల రుక్కు మరణమువల్ల కలిగిన శోకమే ఇందలి కరుణకు స్థాయి. కన్నతండ్రికి అటువంటి బిడ్డను పోగొట్టుకోవటం మరీ దుర్భరమైనది. అతనితోపాటు విచారంపంచుకొనికూడా అతని బంధువులూ స్నేహితులూ అతన్ని మఱపింపలేకపోయినారు. అయిదారు సంవత్సరాలు అయిపోయినాకకూడా ఆ విచారం అంత తీవ్రంగా ఉండటంలో ఈ విషయం వ్యక్తమైంది.

ఈ కథలో పాత్రలందరూ కూడా తమతమ అనుభవాలు జ్ఞాపకంతెచ్చుకొని చెప్పటంలో ఒకవిధమైన కళావిశిష్టత గోచరిస్తుంది. ప్రధానపాత్ర అయిన రుక్కు ఆమె తల్లిఅయిన కాంతమూ పరలోకగాములై అప్రత్యక్షపాత్రలైనప్పటికీ కడమపాత్రలు చేస్తూవచ్చిన తద్గుణ వర్ణనవల్ల అవి కూడా ప్రత్యక్షములే అన్నభావన పాఠకులకు కలుగుతుంది. అప్రత్యక్ష విషయమును పాఠకునకు సాక్షాత్కరింప జేయటంలో ఈ గ్రంథకర్త కృతార్థుడైనాడు. పొంగి చల్లారిన భావాలూ పొందుపడిన భాషా ఇందులో అందగించినవి.

లోకంలో ఉన్నట్లే ఇందలి పాత్రలలోనూ సజ్జనులూ దుర్జనులూ ఉన్నారు. దుర్జనత్వాన్ని చిత్రించటంలోకూడా గ్రంథకర్తకు ఆయా వ్యక్తులయెడ గల సానుభూతి (sympathy) వ్యక్తమౌతుంది. ఇందులో పాత్రలన్నిటిలోకీ దుష్టప్రకృతి రాజమ్మది. ఆవిడ దృక్పథం కేవలం లౌకికమైనది. స్వార్థపరమైనది. ఏ విషయమునైనా స్వప్రయోజనంతో అనుసంధించి తప్ప ఆమె చూడలేదు. ఈ సంగతి ఆమెనుగూర్చి ఇందలి

పాత్రలు చెప్పిన మాటలనుబట్టి వ్యక్తమౌతుంది. రుక్కు తండ్రికి రాజమ్మంటే పరమ ద్వేషం. తన కొడుకునూ కూతురునూ ఆమె ముక్కుమూట లనటమే దీనికి కారణం. రాజమ్మ దుష్టప్రకృతిలో కూడా తనకూతురూ అల్లుడూ అంటే ప్రేమా, వాళ్ళ శ్రేయస్సుకోరే సద్బుద్ధీ ఉన్నవి. రుక్కు తండ్రి పేద మనస్సులో కూడా రాజమ్మను చంపివేదామనేంత క్రౌర్యమూ దేశ కాలాలు పాటింపని తొందరపాటూ ఉన్నవి. మంచి చెడ్డల సమ్మేళనంవల్ల ఈ రెండు పాత్రలూ సత్యసన్నిహితము లైనవి.

ఇందలి పాత్రలన్నింటిలోకీ పంకజమ్మగారు ఈ కుటుంబానికి మేలు కోరింది. బంధువురాలు కాకపోయినప్పటికీ తత్తుల్యమైన ఆదరణా ఆపేక్షా ఆమెకు వారి యందున్నవి. ఈమె వర్తనంలో కాని, భావాలలో కాని, పలుకుబడిలో కాని లోపం ఎత్తిచూపటానికి కనిపించదు. ఈ పాత్రను పోషించటంలో కవి ఏ మాత్రమూ అనవధానత ప్రదర్శింప లేదనటము సత్యదూరం కాదు.

ఇందలి పాత్రలన్నింటిలోకీ ముఖ్యపాత్ర రుక్కుది. ఈమె వయస్సు పధ్నాలుగేండ్లు మాత్రమే. తల్లిపోయి అప్పటికే ఏడాది కావచ్చినది. చదువూ, చక్కదనమూ, తెలివి తేటలూ కలిగి, దుఃఖం దిగమ్రింగి గృహ నిర్వహణ భారమంతా వహించిన రుక్కు అసాధారణ వ్యక్తి అని చెప్పవచ్చు. తల్లి పోయేటప్పుడు తనకు చెప్పినమాట నెరవేర్చటానికి ఆత్మత్యాగమైనా చేయగలగటంలో ఆమె అసాధారణత్వం గోచరిస్తుంది. ఇటువంటి పిల్ల ఉంటుందా అనే

ఈ యీడుకి ఇంత త్యాగబుద్ధి కలుగుతుందా అనీ కొంత మందికి సందేహం కలగవచ్చు. అపురూపమైనప్పటికీ అటువంటి పరిస్థితులలో అటువంటి వ్యక్తి ఉండటానికి కాని, అల్లా వర్తించటానికి కాని ఏమీ అభ్యంతరం ఉండకూడదు.

రుక్కు స్వభావానికి వన్నె పెట్టింది ఆమె మాత్ర గౌరవమూ, పూజా తత్పరత్వమూను. అమాయికమైన ఆమె లేత హృదయం చేసిన ప్రార్థన దేవి విన్నది అని చెప్పటంలో విశేషం లేదు. అటువంటి ప్రార్థనే తండ్రిచేస్తే దేవి వినిపించుకోలేదు. ఈశ్వర విశ్వాసమే, ఈశ్వర సాక్షాత్కారానికీ ఈశ్వరానుగ్రహానికీ సాధనమని మహాత్ములు ఘోషిస్తున్నారు. ఆ విశ్వాసం అమాయిక హృదయాల కున్నంతగా మాయికుల కుండదని కర్త ఉద్దేశం. సత్య సన్నిహితమూ ధర్మ సమ్మితమూ అయిన ఈ కథవల్ల కవి పాఠకులను కర్తవ్య పరాయణులుగా చేయ ప్రయత్నిస్తున్నాడనీ చెప్పవచ్చును.

ఇందులో రుక్కు మేనమామ సత్యం చాలా సజ్జనుడు. ఇటు అప్పపిల్లలనూ బావగారినీ వదిలి పెట్టలేకా, అటు తన అత్తగారు వాళ్ళను పెట్టేబాధలు సహించలేకా, యమ యాతన పడ్డాడు. తన అత్తగారు మూళ్ళమాటలంటుందనీ, తన భార్యకుకూడా వాళ్ళంటే అనురక్తి లేదనీ అతనికి తెలుసు. సుశీ పెళ్ళితోనైనా తన భార్య మనస్సు మారవచ్చునని అటునైపు సంబంధం తొందరచేసి చేయించడంలో ఈ సంగతి వ్యక్తమౌతుంది. బావగారంటే గౌరవమూ, పిల్లలంటే ప్రేమా అతడు అమృత హృదయుడని చెప్పకుండానే చెప్తున్నవి. లోకంలో మంచితనం ఉన్న

వాళ్ళకే శోధనలు వస్తవి. ఆ పరీక్ష కాగేవాళ్లు కొంతమందీ. లొంగే వాళ్ళు కొంతమందీ. సత్యం అందులో ప్రథమ శ్రేణికి చెందినవాడు.

రుక్కు నవనీత హృదయమును ఒక్క రాజమ్మగారు తప్ప అందరూ ప్రేమించిన వాళ్ళే. ఆమె వియోగానికి అందరూ శోకించిన వాళ్ళే. ఆమె స్మృతి అందరనూ ఏదొవిధ కొక్కసారైనా కలతపెట్టి విలపింప చేసేదే. ప్రకృతి కూడా ఆ శోకంలో పాలు పంచుకుంటుంది. గాలికూడా ఇంటి కప్పును కౌగలించుకొని మైదానంమీద పడి ఏడుస్తూ ఎక్కడికో వెళ్ళిపోతుంది.........సుశీ పెళ్లికి అందరూ బయలుదేరి వెళ్తుంటే మబ్బుపట్టి చీకటం ప్రారంభించింది. బండి యెక్కి ఎక్కటంతోటే ఈ వైపునుంచీ, ఆ వైపునుంచీ, చెరో మెరుపూ జంటకత్తులలాగు మెరిసినై. మరు క్షణంలో ప్రయాణం 'వద్దు వద్దు' అని కేక వేసినట్లుగా భయంకరంగా ఆకాశం ఉరిమింది......రుక్కుకు ఉత్తరం వచ్చింది— 'రోజు లైపోయినై' అని.........ఈ మొదలైన సందర్భాలలో గ్రంథకర్త ప్రకృతినీ పాత్రలనూ సంఘటనలనూ ఎల్లా సమన్వయించి లక్షించినదీ వ్యక్తమౌతుంది.

ఈ కథలో శాస్త్ర పరిశోధనకు అగనివీ, శిల్పదృష్టికి మాత్రమే రమణీయమైనవీ ఏవైనా ఉండవచ్చు. అటువంటివి ఈ నాటి సంఘంలో కొంతమంది అయినా నమ్ముతున్నారనీ సత్య సన్నిహితంగా కథ చెప్పటమే గ్రంథకర్త ఉద్దేశమనీ మనము సమాధానపడవచ్చు. రుక్కు జ్వరంలో తల్లివచ్చినట్లు భావిస్తుంది. ఇది ఒళ్లుతెలియని దశలో రోగికి మాత్రమే కలిగే

అనుభూతి కాదు. సుశీ పెళ్లి అయిన తరువాత వధూవరులు తండ్రికి నమస్కరింపవస్తే కాంతంకూడా అతనిప్రక్కన నిల్చి కూతుర్నీ అల్లుడినీ ఆశీర్వదించిపోతుంది. రుగ్మపీడ ఎప్పుడు వదలిపోతుందా అని తపస్సుచేస్తున్న రాజమ్మను చంపటాని కుద్యుక్తుడైన తన భర్తను వారించటానికి కాంతం ఇంకొకసారి సాక్షాత్కరిస్తుంది. దీనినిబట్టి కవికి భూతాలంటే నమ్మకమనీ కాంతం తన సంతానానికీ భర్తకూ శ్రేయస్సుకోరి తనకు పనిపడ్డప్పుడుమాత్రమే కన్పించే భవ్యమూర్తి అనీ చెప్పవచ్చును.

ఎన్నినాళ్లక్రిందటి సంగతులైనప్పటికీ, ఎంతమంది మాట్లాడినప్పటికీ ఇందులో వస్తైక్యం ఎంతమాత్రమూ చెడలేదు. చివరకు హృదయానికి కలిగిన బరువుతీరంగా? లేదా? అన్న ప్రశ్నకు పాఠకులే సమాధానం ఆలోచించవలసి ఉంటుంది.

ఇది నవ్యమైనదనీ, ఉదారమైనదనీ, ఆదరణపాత్రమౌతుందనీ విశ్వసిస్తున్నాను.

చోడవరపు జానకిరామయ్య.

# అంకితం

స్వార్జిత సకలైశ్వర్య సంపన్నులు,
బహువిధ దాన శౌండులు,
స్వకులోద్ధారణ పరాయణులు,
అజరామర కీర్తి ప్రశస్తులు,
వర్తక శిఖామణులు అయిన
కీర్తిశేషులు
శ్రీ తటవర్తి రామబ్రహ్మశ్రేష్ఠిగారికి.

# కృతజ్ఞత

ఈ గ్రంథ ప్రచురణానికి వదాన్యశేఖరులు శ్రీ తటవర్తి నాగపోతరాయశ్రేష్ఠిగారి ఉదారస్వభావం ఆధారం. తండ్రియందలి గౌరవంతో మాతృహీనులైన పసిబిడ్డల సంరక్షణలో ఆత్మార్పణచేసిన త్యాగశీల చరిత్ర చిరస్థాయి కావడానికి పితృభక్తిపూరితులైన శ్రేష్ఠిగారి ద్రవ్యం సహాయపడడం అత్యంతమూ సముచితము. అడిగినవెంటనే ఈ పుస్తకానికైన వ్యయం సమస్తమూ భరించడానికి అంగీకరించిన ఆ తటవర్తి దానశీలునకు నా గాఢకృతజ్ఞత.

మునిమాణిక్యం.

# రుక్కు తల్లి.

అది ఆశ్వయుజ బహుళ అమావాస్య. బైట అంతా చిమ్మచీకటి. మునిసిపల్ దీపాలు మాత్రం మిణుకుమిణుకు మంటున్నాయి. బొంయ్ మంటూ గాలి వీస్తున్నది. ఆ గాలి కిటికీ తలుపులను కాసేపు టపటపలాడించి, దొడ్లో చెట్లను, ఇంటి కప్పును కౌగలించుకొని వచ్చి, మైదానంమీద పడి ఏమస్తూ ఎక్కడికో వెళ్ళిపోయింది.

చీకటి పడ్డది. ఎనిమిది గంటలైంది. ఆ రోజున మేమందరం పెందలాడే భోజనం చేసి కూర్చున్నాం మా హాల్లో. నాకు ఓ పక్కన మా అమ్మాయిలు సుశీ, జయా మరోపక్కన మొగపిల్లలు శాస్త్రి, రాఘా కూర్చున్నారు. గది మధ్యంలో మా పిన్ని కూర్చుంది. ఆ ఎడ పక్కనే పంకజమ్మగారు కూర్చుంది. పంకజమ్మగారు మా పిన్నిని అత్తా అని పిలుస్తుంది. మాకు దగ్గరలోనే డాక్టరు చలపతిరావు గారూ, మా బావమరది సత్యం, ఇంకా ఒకరిద్దరు స్నేహితులూ కూర్చు

నాన్నారు. మాకందరికీ ఎదురుగానే రుక్కు ఫోటో ఉంది. ఆ ఫోటుకు ఎదురుగా ఇంకో గోడమీద అమ్మవారి పటం ఉంది. ఈ రెండు పటాలను పూల మాలలతో అలంకరించాము. "ఇంక చెప్పు నాన్నా" అన్నది సుశీ. నేను ప్రారంభించాను.

* * * * *

......తల్లి పోయినప్పటినుండి రుక్కమ్మే ఇంటికి పెద్ద అయింది. ఒక్క వంటమట్టుకు పెద్దది మా పిన్ని వండిపడేసేది. కాని మిగతా విషయాలన్నీ రుక్కుతల్లి చూడాలిసిందే.

గొల్లదివచ్చి రుక్కమ్మగారూ పెరుగు పట్టండి అనేది. చాకలి రుక్కమ్మగారూ బట్టలు పద్దురాసుకోండి అనేది. పనిచేసేది తెల్లవారక మునుపే రుక్కుతల్లిని లేపేది.

ఇంట్లో ఎవరికి ఏమికావలసినా రుక్కుతల్లిని అడగాలిసిందే. పసిదాన్ని నిద్రలేపి, ముఖం కడిగించి, కాఫీ ఇచ్చి, బడికి పంపాలిసిన బాధ్యత రుక్కుదే. రాధిగాడి లాగూ కనపడకపోతే

రుక్కుతల్లి చేతికి ఇయ్యాలె. శాస్త్రి లెక్కల పుస్తకం కనపడక ఏడుస్తుంటే రుక్కు తెచ్చి ఇచ్చేది. ఇవన్నీ చేస్తూనే, బామ్మకు కూరలు తరిగి ఇచ్చి, ఆమెకు వంటలో సాయపడేది. మధ్య మధ్య తాను చదువుకొంటూనూ ఉండేది.

"రుక్కుతల్లి, ఈ మాసిన బట్టలన్నీ ఇక్కడ పడేశావేం? చిరాకుగా ఉందనమ్మా!" అని నేను విసుక్కుంటే "పాప పడేసి వెళ్ళింది నాన్నా, నేను తీస్తాను" అంటూ నవ్వుతూవచ్చి వాటిని తీసికెళ్ళి, బుట్టలో పడేసి మళ్ళీ చదువుకుంటూ కూర్చునేది. "అమ్మాయీ నా కలం కనపడలేదే" అని నేను కేకేస్తే మళ్ళీవచ్చి రుక్కు నా కలం వెదికి ఇచ్చేది.

నాతోపాటు భోజనానికి కూర్చున్నా నాకంటే ఒక క్షణం ముందులేచి నాకు వక్కలు చేతికిచ్చి నేను ఏమి కావాలన్నా చేతికి ఇచ్చి, నన్ను పంపించి తాను స్కూలుకు వెళ్ళేది.

రుక్కు ప్రతిరోజూ నాకంటే ముందుగానే నిద్రనుంచి లేచేది. లేచి ముఖం కడుక్కొని,

స్నానం చేసి మంచి బట్టలు వేసుకొని, తల దువ్వుకొని పూలు పెట్టుకొనేది. ఆ నల్లని జుట్టులో మందారపువ్వు అమ్మాయికి ఎంతో అందంగా ఉండేది.

దాన్ని చూచి నేను ఎంతో ఆనందించే వాడిని. అమ్మాయి తలకట్టు పెద్దది. కోటేరు పోసినట్లు ముక్కు. దాని అదృష్టము అంతా కళ్ళల్లో ఉందని ప్రతివాళ్ళూ అనే వాళ్ళు. నవ్వితే ముత్యాలు వలకపోసినట్లు ఉండేది. గొంతెత్తి ఒక్క కీర్తన పాడినప్పుడు వెయ్యి వీణలు ఒక్క శ్రుతిలో పలికినట్లు ఉండేది.

పిల్లలున్నారు. ఇల్లు సద్దుకుపోవటానికి పక్కతల్లి ఉంది. వండిపెట్టటానికి మా పిన్ని ఉంది. సంసారం గడిచిపోతుంది అన్న ఆలోచనలతో ఆవిడ పోయిన దుఃఖాన్ని చాలవరకు దిగ మింగాను.

రుక్కు పెద్దదై అత్తవారింటికి వెడితే ఎల్లాగా అన్న సంగతి ఒకటి ఉందిగాని, నేను ఒక విధంగా అనుకొన్నాను. అల్లుడు ఇంకా స్కూలు

ఫైనలులోనే ఉన్నాడు. అల్లుణ్ని ఇంట్లో ఉంచుకొని, బి. ఏ. దాకా చదువుకోమని అందాము. ఈ మధ్య అమ్మాయికీ చదువు పూర్తి అవుతుంది. అల్లుడూ, కూతురూ నా కళ్ళ ఎదుటనే ఉంటారు. ఆయన బి. ఎ ప్యాసు అయ్యేటప్పటికి నాలుగేండ్లు గడుస్తుంది. ఈ లోపున పిల్లలు కాస్త పెద్దవాళ్లు అవుతారు ఫరవాలేదు. దాని తరువాత సంగతి చూచుకోవచ్చు ననుకొన్నాను.

ఎంత రాత్రికి వచ్చినా మా అమ్మాయి నా కోసం ఎదురుచూస్తూ కూర్చునేది. "పడుకోని నిద్రపోక పోయినావే తల్లీ? ఎందుకు మేలుకుని కూర్చున్నావమ్మా" అంటే "ఏదో నాన్నా నీవు వస్తావు గదా అని కూర్చున్నాను. మరేం ఫరవాలేదు నాన్నా" అని మాత్రం అనేది. నేను పడుకొని అమ్మాయి ఒక త్యాగరాయకృతి పాడితే విని నిద్రపోయేవాడ్ని.

వాళ్ళమ్మ ఉంటే ఎంత సంతోషించేదో రుక్కుమ్మ పని పాటలూ అవీ చూచి అని నేను నిట్టూర్పు విడిచాను......

"వాళ్ళమ్మే బ్రతికుంటే అసలు ఇట్లా ఎందుకొస్తుందీ! దాని చేతుల మీదుగా జరగాల్సిన సుశీ పెండ్లి వాళ్ళ మామయ్య సత్యం ఎందుకు చేస్తాడు!! ఆ పెండ్లికనేగా రుక్కు తెనాలి వెళ్లింది. ఆ పెండ్లికి అది వెళ్ళక పోయినట్లయితే ఎట్లా ఉండేదో! అసలు నేను వద్దు వద్దు అంటూనే ఉన్నాను. నా మాట విన్నాడూ! మీ నాన్న!! బుడబుడ బయలు దేరాడు" అని మా పిన్ని విసుక్కొంటున్నది. "నీవు వద్దు అంటూ ఉంటే నాన్న సుశీ పెండ్లి ఎందుకు చేశాడు బామ్మా?" అని మా శాస్త్రి అడిగాడు. ఆవిడ చెప్పుకొచ్చింది......

* * * * *

......మీ అమ్మపోయి అప్పటికి ఆరు నెలలు అయింది. మిమ్మల్లను చూచి పోదామని ఒక రోజున మీ మామయ్య వచ్చాడు. వాడు ఇంట్లోకి వచ్చి ఒక్కపోయి నుంచున్నాడు మిమ్మల్లను చూస్తూ. పాపం వాడి అక్కయ్య లేదాయె నాయినా వచ్చాడా అని సంతోష పడటానికి. వచ్చేరావటంతోనే వాడు మిమ్మల్నందరను కౌగలించుకొని, ఎంతో సేపు ఊహలు కదిపాడు.

తరువాత వాడు మీ నాన్నతో ఏదో ఆ విషయం ఈ విషయం మాట్లాడి చివరకు అన్నాడు "బావా సుశీకి ఈమాసంలో పెళ్ళి చేద్దాము" అని. మీ నాన్న అన్నాడూ "సుశీకి ఇప్పుడు ఏదో ఎదిగిన తొందరపడి ఎవరికో ఒకరికి అంట గట్ట వలసిన అవసరం ఏమీ లేదు. ఏం తొందర రా? అని.

"అదికాదు బావా, మంచి సంబంధం వచ్చినప్పుడు మనం చెయ్యకపోతే, ఆ తరువాత కావాలంటేమటుకు సంబంధాలు దొరుకుతయ్యా!" అన్నాడు మీ మామయ్య. "సుశీకి అదృష్ట వశాత్తు మంచి సంబంధం దొరికింది. ఎవరో కాదు. నా భార్య మేనమామ కొడుకు. ఈ సంబంధంవిషయమై నేను ఎంతో ఆలోచించాను. రుక్మకు ఎట్లాగూ పెళ్లి అయింది. దాని దిగులు మనకు లేదు. ఆ పసిదానిమాట ఇంకా సరేసరి. ఎట్లాచ్చి ఈ సుశీకి ఈ సంవత్సరం కాకపోయినా ఇంకా రెండేండ్లకయినా చేయాలి సిందే. ఈ సంబంధం చేస్తే ఇంకో లాభంకూడా ఉంది. నా మేనకోడలని సుశీపడల నేను ఎట్లాగూ

ప్రేమగా ఉంటారని, తన మేనమామకొడుకు భార్య అని మా ఆవిడకూడా దానిని ప్రేమగా చూస్తుంది. అందుకని ఇంత ఎక్కువగా ఆలోచిస్తున్నాను" అనికూడా అన్నాను.

మీ నాన్నకు సత్యం అంటే ఎంతో ప్రేమ. చిన్నప్పటినుండీ సత్యం మీ నాన్న దగ్గరే పెరిగాడు. మీ మామయ్యకు చిన్నతనంలోనే తల్లీ, తండ్రీ, పోయినారు. మీ నాన్నే వాడిని దగ్గరకుతీసి పెంచి పెద్దవాణ్ణి చేశాడు. వాడిని పెద్దకొడుకు లాగ చూచుకొన్నాడు. బుద్ధులు చెప్పాడు. జీవితం ఎట్లాగ నిర్ణయించుకోవాలో తెలియని పసితనంలో వాడికి ఒక జీవితపథం నిర్ణయించాడు.

అందుకని మీ నాన్న సత్యం మాటను కాదనలేక పోయినాడు. అక్కడికీ అనకపోలేదు "ఒరే ఇది చిన్నప్పటినుంచీ నీ దగ్గరే పెరిగింది. దీని వివాహం విషయమై నీవు బాధ్యతా వహిస్తానంటే నేను వద్దనను. దీనికి, నీ ఇష్టంవచ్చిన సంబంధమే చెయ్యి. కాని ఇంత తొందరెందుకురా?" అని అంటే, మీ మామయ్య

సమాధానం చప్పన చెప్పక, ఊరికే సుశీ వంక పిచ్చి చూపులు చూచిచూచి, ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచి చివరకు వణుకుతున్న గొంతుకతో అన్నాడు, "తల్లి పోయిన సంవత్సరంలో పెండ్లిచేస్తే మంచిదని పెద్దలు అంటారు" అని. ఈ మాటలు అని ఒక్క వేడికన్నీటి బొట్టును మణికట్టుతో తుడిచేసుకున్నాడు.

మీ నాన్నకు ఏమంటానికి తోచలేదు. పెద్దపిల్లగదా అని రుక్కును అడిగాడు. అది ఎంత తెలివిగలదో, ఎంతనమ్రత గలదో చూడు! "నాకేం తెలుసు నాన్నా. నువ్వూ మామయ్యా ఆలోచించండి. మీ కంటే ఎక్కువ తెలుస్తుందా నాకు!" అన్నది నవ్వుతూ.

వాడు అంతగా చెప్తూ ఉంటే ఎవ్వరేమంటారు? నేనుకూడా గట్టిగా వద్దు అనలేకపోయినాను. సరే, నంటే సరే ననుకొని మీ మామయ్య వెళ్ళిపోయినాడు. ఆ సాయంత్రమే లగ్నం నిశ్చయించి ఉత్తరం వ్రాస్తానని చెప్పి... "అయితే నాన్నా రుక్కు అక్కయ్య అప్పటికే

పెద్దదన్న మాట? అని అడిగింది సుశీ" నేను ఇల్లా అన్నాను.

* * * * *

......పెద్దది కాకేమమ్మా పద్ధానుగు ఏళ్లు ఉన్నాయి. కాపరానికి వెళ్ళే ఈడు వచ్చింది. వీళ్ల బావ అప్పుడు గుంటూరులో చదువుకొంటూ అప్పుడప్పుడు ఇక్కడికివస్తూ ఉండేవాడు.

ఇంకో తమాషా ఏమిటంటే రుక్కు మొగుడితో కలిసి మెలిసి ఉండేది! చక్కగా మాట్లాడేది. భార్యాభర్తల మధ్య ఉండే సిగ్గు, భిడియమూ వాళ్ళిద్దరి మధ్య ఇంకా ఏర్పడలేదు. వాళ్ళిద్దరూ చిన్న పిల్లల్లాగే, ప్రవర్తిస్తూ ఉండేవాళ్ళు.

ఒక రోజున నేను ఇంటికి వచ్చేసరికి రుక్కూ అల్లుడూ బజారుకు కామాలు వెళ్ళి అప్పుడే వచ్చారు. బండి వాకిట్లో ఉంది. రుక్కు ముందు బండీదిగి, ఒక బట్టలమూట మొగుడికి అందించింది. ఆ మూట తీసుకొని ఆయన యకాయకీని మేడపైకి

వెళ్లిపోయినాడు. ఇదికూడా వాడి వెంటనే వెళ్లింది.

వీళ్ళిద్దరి అన్యోన్యం చూచి నేను ఎంతో సంతోషించాను. ఇదంతా మీ బొమ్మకూడా చూస్తూనే ఉంది. ఆమెకూడా ఎంతో సంతోషాన్ని కనపరుస్తూ నాతో అన్నది. "ఓరేయ్ చూడూ, పిల్ల పెద్దది అయింది. ఆ శేకాలం ఉంచటం బాగుండదు. ఈ మాఘ మాసందాటి పోనీయకుండా చూడు" అని నేను నవ్వుకొని "అల్లుడు బి ఏ. పాసు అయిందాకా ఆపుదామని చూస్తున్నానమ్మా" అన్నాను. ఆవిడ తల ఊపి, "అంత తెలివి తక్కువ పని ఇంకొకటి లేదు. ఆ కాస్త ఆటంకం నీవు తీర్చకపోతే వాళ్ళే తీర్చుకొంటారు. నీవే ఆ కాస్త మర్యాద దక్కించుకొంటే మంచిది" అన్నది. నేను అల్లాగే చేద్దామనుకొన్నాను. "మళ్ళీ వచ్చే మాఘమాసానికి మనవణ్ణికూడా ఎత్తుకొంటావు" అని మా పిన్ని అని వెళ్ళిపోయింది.

ఇంతలో రుక్కు కొత్త పరికిణీ కట్టుకొని కొత్తవోణీ వేసుకొని నా దగ్గరకు వచ్చింది. ఎంతో

అందంగా ఉంది. సంతోషంతో నా కడుపు నిండి పోయింది. "బాగుంది. ఈ పరికిణీ నీకు ఎంతో బాగుంది తల్లీ" అన్నాను. "బావ కొని ఇచ్చారు నాన్నా" అన్నది రుక్కు ముత్యాలు జలజల రాలుస్తూ.

నేను రుక్కువంక కాసేపు చూచి ఇది చక్కనిది. ఇంత చక్కనిది పుట్టటం నా పూర్వ జన్మ సుకృతం అనుకొన్నాను. అదే పనిగా ఊరికే చూస్తే దానికి దృష్టి తగులుతుందని చటుక్కున తల వంచేసుకొన్నాను. ఇంతలో రుక్కు వంగి నా పాదాలు ముట్టుకొని నమస్కరించింది. దీర్ఘాయుష్మంతురాలవు కా తల్లీ అని దీవించాను.

ఈ చక్కని బిడ్డను చూచి ఆనందించటానికి తల్లి లేక పోయింది కదా అన్న విచారంతో నేను నిలువునా నిలబడి పోయినాను. ఇంతలో రుక్కు మీ అమ్మ ఫోటో దగ్గరకు పోయి నమస్కరించింది. ఆ దృశ్యాన్ని నేను చూడలేక పోయినాను.

ఒరేయ్ నాన్నా సుశీ వినండి. మీ అమ్మకు ఇంకొక అరగంటకు ప్రాణం పోతుందనగా గొంతు

పోసుకు పోయింది. రుక్కుమటుకు మొదటినుంచీ తల్లిని చూస్తునే ఉంది రాధాయను ఎత్తుకొని. మీ అమ్మ ఎన్నాగో అవస్థపడి మిగిలిన పిల్లలను అందరినీ పేరు పేరునా పిలిచి, ఆఖరుసారి కళ్ళతో చూచింది. అయితే ఒక్క సంగతి. చివరదాకా ఆమె దృష్టి అంతా రాధాయను ఎత్తుకొని నిలుచున్న రుక్కుమీదనే ఉంది. మీ అమ్మ పోయిన తరువాత మిమ్ముల్లను పెంచింది రుక్కే. ఎవ్వరూ చెప్పకుండానే ఆ బాధ్యత అంతా రుక్కు వహించింది...

"నిజమే కాని, మొట్ట మొదటినుంచి రుక్కుకు రాధాయు అంటే ఎందుకో ఎక్కువ ప్రేమ కాదూ?" అని సుశీ అడిగింది. "కడసారి పిల్ల వాడను మగ్గు అంతకంటే ఇంకేముంటుంది?" అన్నాను నేను. "అదేకాదు. దానికి రాధాయ పైన ఎక్కువ ప్రేమ ఉన్నమాట నిజమే" అంటూ వాళ్ళ మామయ్య చెప్పుకొచ్చాడు.

* * * * *

......మా అక్కయ్య పోయిన కొత్తలో నేనొక సారి వచ్చాను. ఆ రోజున మీ నాన్న వూళ్లో

లేదు. నేను రాత్రి చాలా ప్రొద్దుపోయి ఇంటి కొచ్చాను. నేను వచ్చేసరికి రాధాయ గుక్కపట్టి ఏడుస్తున్నాడు. రుక్కు వాడిని ఎత్తుకొని సముదా యిస్తున్నది. వాడు ఏడ్పు మానటంలేదు. ఎందుకే వాడు ఏడుస్తాడూ? అన్నాను. "వాడికి బెల్టు కావాలట మామయ్యా! వాళ్ళ అబ్బాయి పెట్టు కొంటే చూశాడు. అప్పటినుంచీ ఒక్కతీరాన ఏడుస్తున్నాడు. బజారుకు ఎవరినైనా పంపిద్దా మంటే ఎవ్వరూ కనపడలేదూ! ఇంతలోకే నీవు వచ్చావు. బజారుకు పోయి ఒక మంచి బెల్టు తీసు కురా మామయ్యా" అన్నది.

"వాడు ఎప్పుడూ మొండి మొలతోనే తిరు గుతుంటాడాయె! ఎప్పుడూ బొందు లాగూలు తొడుక్కుంటాడు గదా! వాడికి బెల్టు ఎందుకే రుక్కూ?" అన్నాను నేను.

"ఆ బొందు లాగూలపైనే బెల్టు పెట్టు కొంటాడు! లేకపోతే బెల్టుకోసం పంట్లాము కుట్టించుకొంటాడు! అదంతా నీ కెందుకూ? బెల్టు ఒకటి తీసుకొని రా" అన్నది.

ఇప్పుడు మళ్ళీ బజారు కెళ్ళేదికే. వాడు అడిగినదల్లా ఇస్తూ ఉండబట్టే వాడు అల్లాగ తయారైనాడు. ఈ అర్ధరాత్రి బజారుకెళ్ళి బెల్లు తెమ్మంటం ఏమిబాగుందే అమ్మాయీ? అన్నాను నేను.

"బాగుండటం ఏమిటి మామయ్యా! వాడు ఏది కోరితే అది ఇవ్వాలిసిందే. పసివాడు. వాడి మనస్సు చిన్నబోతే నా కెట్లాగో ఉంటుంది" అని జాలిగా అన్నది.

అంతవరకు అది అన్నం తినలేదు. అప్పటి కప్పుడు నేను బజారుకెళ్ళి బెల్లు తెచ్చియిస్తే అది వాడికి ఇచ్చి, సంతోషపెట్టి, వాడు దాన్ని పెట్టుకొని నిదరపోయినతరువాత, రాత్రి పదకొండింటికి అన్నం తిన్నది.

రుక్కూ వాడిని నీవు మరీ గారాబం చేస్తు న్నావే! అంటే, "చిన్నవాడు మామయ్యా, అందరిలోకి చిన్నవాడు. అమ్మ ఉంటే వాడిని ఎంత ముద్దుచేసేదో! అమ్మ లేకపోయె! నేనన్నా చెయ్యొద్దా?" అని అనేది వాడ్ని ఎత్తుకొని

గుండెకు అదుముకొంటూ. స్కూలు నుంచి రావటంతోనే వీడు "పెద్ద అక్కయ్యా!!" అంటూ దానిమీదికి దూకేవాడు. అది ముందు వీడ్ని ఎత్తుకొని ముద్దాడి, తరువాత ఏ పని అయినా చూచుకొనేది. వాడిమీద దానికి ఎక్కువ అపేక్ష ఉన్న మాట నిజమే...అని సత్యం చెప్పటం మానేశాడు. నాకూ ఆ మాట నిజమేనని జ్ఞాపకంవచ్చి, ఏం చెప్పనూ అంటే,

* * * * *



అవునవును. రుక్కు రాధాయమీద పంచ ప్రాణాలు పెట్టుకు తిరిగేది. వాడికి చీమకుడితే గిలగిల లాడేది. తల్లి ఉన్నా వాడిని అంత ప్రాణంగా చూసేది కాదనుకొంటా!

ఒక రోజున నేను ప్రొద్దు పోయినదాకా చదువుకొని పడుకొన్నాను. వెంటనే నిద్రపట్టింది. ఎప్పుడో అర్ధరాత్రి వేళ మెళుకువ వచ్చింది ఎవరో మాట్లాడుతున్నట్లు అలికిడి అయింది. కళ్లు తెరచి చూస్తునుగదా రుక్కు వెండిగిన్నెలో పాలూ, పంచదారా కలిసి ఆరబోస్తున్నది. రాధాయ

కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. "ఏమిటే అమ్మాయీ అర్ధరాత్రి ఇప్పుడు లేచి కూర్చున్నా వేమమ్మా?" అన్నాను.

"సాయంత్రం రాధాయ సరిగ్గా అన్నం తినలేదు నాన్నా! అందుకని కాసిని పాలు ఇస్తున్నాను" అన్నది. ఏమీ ఎందుకు తినలేదూ? అని నేను అడిగాను. అది అన్నది. "వాడు అన్నం పెట్టటం కొంచెం ఆలస్యమైంది. ఇంతలో వాడికి నిద్రవేళ అయింది. నేనైతే అన్నంకలిపి పెట్టి తినిపించాను గాని వాడు సరిగ్గా తిన్నట్టులేదు నాన్నా! పడుకొన్న తరువాత అనుమానం కలిగింది ఈ నిద్ర మత్తులో బిడ్డ సరిగ్గా అన్నం కడుపు నిండా తిన్నాడా లేదా అని. అప్పటినుంచి నాకు నిద్రపట్టలేదు. నా కోసం అని పెట్టుకొన్న పాలు అట్టు ఉంచేసి వాడిని లేపి తాగిస్తున్నాను. పాపం వాడికి ఆకలైంది కామాలు నాన్నా గుటుకు్కున గుటుకు్కున తాగేస్తున్నాడు. ఈ పాలు ఇవ్వకపోతే ఇంత ఆకలితోనూ పడుకొనే వాడే కదా!"

అమ్మాయీ నీవు ఇల్లాగ నిద్రాభంగం చేసుకొంటే నీ ఆరోగ్యం చెడిపోదమ్మా! అన్నా

తిన్నాడుగా! ఇంకా ఆకలేస్తున్నా మిగిలి ఉన్నదనా నీ భయం! ఆ కాస్త ఆకలి ఉండటమే మంచిది. నీవు ఇల్లాగ ఆరోగ్యం చెడగొట్టకూడదు అని నేను అన్నాను.

"అదేమిటి నాన్నా అల్లా అంటావ్! బిడ్డను కాస్త ఆకలితోనే పడుకోబెట్టటం మంచిదా? బాగా అన్నావు!! నీకు తెలియదులే. ఇహ ఊరుకో. వాడి సంగతి నేను చూచుకొంటాను" అని నన్ను కోప్పడుతూ వాడికి పాల గిన్నె నోటికి అందించింది మళ్ళీ. ఆ తరువాత వాడిని చిచ్చికొట్టి నిద్రపుచ్చి, అప్పుడు తాను నిద్రపోయింది. దానికళ్ళు ఎప్పుడూ వాడిమీదనే ఉండేవి. సత్యం అన్నమాట నిజమే. పుట్టి మొదటినుంచీ రుక్కు రాధాయను, తల్లికంటె ఎక్కువగా చూచింది.....

"ఇదంతా ఎందుకర్రా. రాధాయకు జ్వరం వచ్చినప్పుడు రుక్కు పడ్డ యాతన ఇంతా, అంతానా!! చూచిన వాళ్ళంతా ఆశ్చర్యపోయినారు" అన్నది మా పిన్ని నా మాట అందుకొని.

"రాధాయకు జబ్బుచేయటం ఏమిటి బాపమ్మా?" అని సుశీ అడిగింది. "నాకు జబ్బుచేస్తే రుక్కు అక్కయ్యా యాతన పడ్డారా చెప్పవూ ఆ సంగతి?" అంటూ రాధాయకూడా వాళ్ళ బాఅమ్మ దగ్గరగా జరిగి కూర్చున్నారు. ఆవిడ చెప్పకొచ్చింది.

* * * * *

.....సుశీకి పెండ్లి చేద్దామని నిశ్చయించి, సంబంధాలు వెదకటానికి తెలియపరుస్తానని మీ మామయ్య వెళ్ళిపోయిన నాలుగు రోజులకు రాధాయకు పెద్ద పెట్టున జ్వరం వచ్చింది. మొదట్లో ఏదో మామూలు జ్వరం అనుకొని చలపతిరావుగారి దగ్గర నుంచి మందు తెచ్చి ఇచ్చాము. నయం కాలేదు. ఎప్పుడూ నూటనాలుగూ, నూటఅయిదూ ఉండేది. నాలుగైదు రోజులు చూశాము. జ్వరం ఏమీ తగ్గలేదు. ఆ వారం అంతా అట్లాగే గడిచింది.

రెండో వారం జ్వరం తీవ్రత బాగా హెచ్చింది. తగ్గటం లేదు. పసివాడు చాలా నీర

సించి పోయినాడు. ఆ వారం అంతా అక్కగానే జరిగింది.

రుక్కు ఇంకా హడలి పోయింది. ఒక్క నిమిషం అయినా వాడిని వదిలి ఉండేది కాదు. ఎప్పుడూ వాడి దగ్గర పడుకొని ఉండేది. లేకపోతే వాడి మంచం ప్రక్కనే తాను ఒక మంచం వేసుకొని, దానిమీద పడుకొని ఉండేది కళ్ళన్నీ వాడి మీదే పెట్టుకొని. ఇది ప్రక్క వదిలి లేచిందో వాడు కెవ్వున కేక వేసే వాడు!

రుక్కు మాటకు ఏమంత పెద్దది! పద్నాలుగు పదిహేను ఏళ్లుగా! రాత్రి రాత్రి పగలు పగలు తానూ జ్వరం వచ్చిన వాడిదగ్గర పడుకోటం ఎంత కష్టం! విసుగు గా ఉండదూ! కాస్త అటూ ఇటూ తిరిగటానికి లేకపోను! దాన్ని వాడు వదలనిచ్చే వాడు కాదు. దాని ఒళ్ళోనే దూరి పడుకొనే వాడు.

అన్నం తినటానికి కాస్త అటు వెళ్ళటం తోనే ఏమి ఏడుపు! అన్నం తిని వస్తుందిరా నాయినా అంటే వినక గుక్కపట్టి ఏడ్చేవాడు.

"ఏడిస్తే ఏడ్చానులే. నువ్వు తొందర పడవద్దు. కడుపునిండా అన్నం తిను అమ్మా" అని నేను అనేదాన్ని. కాని రుక్కు అదేదో తత్తర బిత్తరగా నాది ఆదరా బాదరా రెండు మెతుకులు నోట్లో వేసుకొని, మళ్ళీ గబగబా పరుగెత్తేది వాడి దగ్గరకు. వెళ్ళి పక్కలో పడుకొని "నాయినా రాధా! ఎందుకురా అట్లా ఏడుస్తావూ? నేను ఇక్కడే ఉన్నానుగా! ఇల్లాగ ఏడిస్తే జ్వరం ఎక్కువ గాదురా నాయినా? పడుకో" అని వాడిని తన ప్రక్కకు తిప్పుకొనేది. వాడు దాన్ని కౌగలించుకొని కళ్లు మూసుకొని నిశ్చింతగా పడుకొనే వాడు.

అప్పుడు రుక్కు ఎంత దిగాలు పడిపోయిందను కొన్నారు!! దాన్ని చూస్తే జాలేశేది. కళ కళలాడే కళ్ళల్లో నీళ్లు తొణికిస లాడుతూ ఉండేవి. ఒక్కొక్క రోజున కళ్ళు జ్యోతుల్లై ఉండేవి. అదేమిటే రుక్కూ అంటే, రాత్రి నిద్ర పట్టలేదు బామ్మా అంటూ లేనినవ్వు తెచ్చి పెట్టుకొనేది. కాని దాని హృదయంలోని బాధ అంతా కళ్ళల్లో నుంచి, పంజాలు కట్టిన బండిలోనుంచి ఘోషా

స్త్రీలు మాటిమాటికి తొంగి చూచినట్లు, చూస్తూనే ఉండేది.

అయితే బేజారైపోయి, ఏ పనీ చెయ్యలేక పోయే దనుకున్నారా? ఊహు. చెయ్యవలసిన పనులన్నీ అదే చేసేది. ప్రొద్దున, మధ్యాహ్నం, సాయంత్రం, టెంపరేచరు చూచి కాగితంమీద వ్రాసి ఉంచేది. సరిగ్గా టైము ప్రకారం మందు ఇచ్చేది. బత్తాయి రసం తీసి సరిగ్గా ఎప్పుడు ఇవ్వాలో, అప్పుడు ఇచ్చేది. డాక్టరు చెప్పినట్లు చేసేది.

మీ నాన్న ఏమీ పట్టించుకొనే వాడు కాడు. పండ్లూ, మందులూ, అన్నీ బజారునుంచి రుక్కే తెప్పించుకొనేది. డాక్టర్లు వచ్చి "రుక్కు తల్లీ ఎల్లా ఉందమ్మా తమ్ముడికి? టెంపరేచరు పాట వేశావా? విరోచనాలు ఎన్ని సార్లు అయినై" అని అడగవలసిన ప్రశ్నలన్నీ దాన్నే అడిగేవారు. వాళ్ళిద్దరూ మాట్లాడుకొనే వాళ్ళు. క్రొత్త మందులు ఏవి తెప్పించవలసిందీ, ఏ మందు ఎంతెంత మోతాదులో ఎప్పుడెప్పుడు ఇవ్వాల్సిందీ, అంతా దానితో మాట్లాడే వాడు ఆయన.

"మందు ఏమైనా మార్చాలా అండీ? క్రొత్త మందులు ఏమైనా కొనమంటారా?" అని మీ నాన్న ఎప్పుడైనా అడిగితే, డాక్టరు హేళనగా నవ్వి, "నీకెందుకయ్యా ఆ విషయాలన్నీ? చెబితే మటుకు నీ కేమి తెలుస్తుంది! ఎవరికి చెప్పటం అవసరమో వాళ్ళతో చెప్పాను. నీవు వెళ్ళిపో ఊరికే ఆందోళన పడక" అనేశాడు.

అమ్మాయి ఆ సంగతులన్నీ గ్రహించి మందులు చక్కగా నడపగలదని ఆయన ధైర్యం. అందుకని ఆయన రోగిని ఈ నర్సు చేతుల్లో పెట్టి నిశ్చింతగా వెళ్ళి పోయేవాడు.

రాధా యకు జబ్బుగా ఉన్నన్నాళ్లూ రుక్కుకు యాతన తప్పలేదు. ఎప్పుడైనా నేనో మీ నాన్నో పిల్లవాడిని కాస్త కాపాడుకుందా మనుకొంటే వాడు మమ్మల్ని చూచి కిలకిలాడే వాడు. ఏంరా? అంటే "పెద్ద అక్కయ్య" అని దానివైపు వేలుచూపి ఏడ్చేవాడు. పెద్ద అక్కయ్య! పెద్ద అక్కయ్య! ఒకటే పెద్ద అక్కయ్య!! దాన్ని వేధించుకు తిన్నాడు.

నాకు అల్లాగే జ్ఞాపకం. ఏం బామ్మా అంతేనా?" అని శాస్త్రి అడిగాడు. అవునని మా పిన్ని తల ఊపింది. "అదేమిటి బామ్మా అట్లా ఎందుకు జరిగిందీ? ఒక చాప వాడికి. అంత జ్వరం ఏమిటి? నా పెళ్ళేమిటి? ఎందుకు అట్లా జరిగింది? వాడికి కాస్త నయం అయినదాకా ఆపలేక పోయినారా?" అని సుశీకూడా అడిగింది. ఆవిడ "ఊ!... ఏదో తొందర పడ్డారు. ఎవరికి తెలుస్తాయమ్మా కారణాలన్నీ! మీ నాన్న, మీ మామయ్యా కలిసి బుడబుడ చేసేశారు!" అని విసుగుగా అంది అసలు కారణం వివరంగా చెప్పక. అందుకని నేనే ఆ విషయం పిల్లలకు చెప్పాను ఇల్లాగ.

* * * * *

......అదేమిటమ్మా పిన్ని అల్లాగంటావ్వా! లగ్నం పెట్టాము బయలుదేరి రావలసింది అని ఉత్తరం వచ్చిందా? వచ్చిన మర్నాడే పోస్టు ఈ లగ్నానికి వద్దు పిల్లవాడికి జ్వరం తగ్గిన తరువాత చూచుకో వచ్చునని వీడికి ఉత్తరం వ్రాయలా?...

అని నా ప్రక్కనే తలవంచుకొని కూర్చున్న సత్యం వంక చూశాను. సత్యం చెప్పింది ఇది

*　　*　　*　　*　　*

......నిజమే బావా. నీవు ఉత్తరం వ్రాసినమాట నిజమే. లేదని ఎవరన్నారూ? నేను మాత్రం ఏం జేసేది? "ఈ లగ్నం తప్పితే మళ్ళీ మాఘ మాసందాకా లగ్నాలు లేవు. ముసలాయనకు ఏమీ బాగుండలేదు. ఆయన కళ్ళముందు ఈ పెళ్ళి జరగాలె. చేస్తే ఈ లగ్నానికే చెయ్యండి లేకపోతే మానుకోండి" అని అవతల వాళ్ళు అన్నారాయె!! నేను మటుకు ఏం జేసేది! అందు కని మిమ్మల్లను తొందరపెట్టి రమ్మని మళ్ళీ వ్రాశాను... ఈ మాటలు అని ఊరుకున్నాడు సత్యం. "అయితే ఈ జ్వరంతో ఉన్నవాడిని కదలించి తెనాలి తీసికెళ్లాము మనము కాదు నాన్నా? టైఫాయిడ్ జ్వరంలో ఉన్నవానిని తీసికొని వెళ్ళటానికి నీకు ధైర్యం ఎట్లా వచ్చింది నాన్నా! భయము వేయలా? పైగా ఆ రోజున వర్షం పడు తున్నట్టుకూడా నాకు జ్ఞాపకం! అంతేకదు నాన్నా?" అని సుశీ గుచ్చి గుచ్చి అడిగితే, జబ్బు

పిల్లవాడిని కదిలించటానికి ఎట్లా ధైర్యం వచ్చిందీ, ఆ రోజున మేము వర్షంలో ఎల్లాగ ప్రయాణం చేసిందీ చెప్పాను నేను ఇల్లాగ.

*    *    *    *    *

......అన్నాయీ విన్నావుగా మా మయ్య అన్నమాటలూ !! అవతల వాళ్ళు తొందర పడటం మూలాన మనలను అందరినీ బయలుదేరి రమ్మని వ్రాశారు. నాకు ఆ సంగతి అప్పుడు తెలియదు. తెలియక పోయినా ఒకటి అనుకొన్నాను. వాడు అల్లాగ అంటే నేను వద్దు అనటం మంచిది కాదు. వాడుమటుకు అంత తొందరపడే మనిషి ఏమాత్రం కాదు. ఇల్లాగ తొందర పడుతున్నాడూ అంటే తగినంత కారణం ఉండీ ఉంటుంది. ఇల్లాగ అను కొని వెళ్లటానికే నిశ్చయించాను.

అమ్మాయి అన్నట్లు, రాధి గాడ్ని ఆ స్థితిలో కదిలిస్తే ఏమి ప్రమాదం వస్తుందో అని భయపడక పోలేదు. కాని డాక్టరుకు చెబితే, ఆయన అన్నాడు, "మరేమీ భయంలేదు తీసి

కళ్ళండి. రేపు బయదేరేటట్లు అయితే నేనూ వస్తున్నాను తెనాలి ఒక పనివుంద.

ఆయనకూడా మాతో ప్రయాణం చేయటం మరీ మంచిది అనుకొన్నాను. ఎందుకంటే ఆయన దారి పోతుగునా శాస్త్రం కాస్త కనిపెట్టి చూస్తూ ఉంటారు. దానికి తగినట్లు ఆ ముర్నాడే ప్రయాణానికి మంచి రోజుకూడా కుదిరింది. అందుకని బయలుదేరాం... "ఆరోజున వర్షం కదు నాన్నా?" అని సుశీ మళ్ళి అడిగింది. నేను మళ్ళా ఇల్లాగ చెప్పుకు పోయినాను.

* * * * *

......అవునమ్మా ఆ రోజు మబ్బు పట్టింది. కొద్దిగా వర్షం పడటంకూడా ఆరంభించింది. ఆకాశం మేఘచ్ఛన్నమై ఉన్నపుడు ప్రయాణం చేయకూడదు అంటారు. కాస్త సంకోచించాను.

ఏమిటో ఇవి పిచ్చి భయాలు. కొద్దిగా చినుకు పడుతున్నదే కాని పెద్దవర్షం కాదు. ఈ రోజున ప్రయాణం ఆపివేస్తే మళ్ళీ మంచిరోజు

దొరకదు, లగ్నానికి అందుకోలేను, అని నన్ను ఇల్లాగ, అనుకొని వెంటనే బండి పిల్చుకొని వచ్చి పిల్లలను ఎక్కించాను. మేము బండి ఎక్కే-ఎక్కటం తోనే, ఈ వైపునుంచి ఒక మెఱుపూ, ఆ వైపు నుంచి ఒక మెఱుపూ తళుక్కున మెరిసినై రెండు కత్తులను ఒక్క సారి ఏవరో మెఱిపించినట్లు! కొద్దిగా భయం వేసింది. మరు క్షణంలో భయం కరంగా ఉఱిమింది ఎవరో "వద్దువద్దు" అని కేక వేసినట్లు!

రుక్కుతల్లి తెల్లపోయింది. భయం లేదు తల్లీ వర్షం ఏమీ అంత పెద్దది కాదు అని నేను అన్నాను. అమ్మాయి తమ్ముడిమీద చెయ్యివేసి, భయంలేదు నాన్నా అని చెబుతున్నది.

నేనేదో తప్పుచేస్తున్నట్లు నా గుండె దడ దడ లాడింది. ఆ చినుకులూ, మెఱుపులూ, ఉఱు ములూ నన్నేదో భయం పెట్టినై. జ్వరంలో ఉన్న పిల్లవాడిని ఈ గాలిలో తీసుకొని పోతున్నాను. వీడికి జ్వరం ఎక్కువ అవుతుందేమో! నిమో నియా వస్తుందేమో నని ఇల్లాగ అనుకొన్నాను

గాని, ఈ ప్రయాణం నీవు చేయకూడదు సుమా అని భగవంతుడు తన దూతలద్వారా చెబుతున్నాడని నేను ఊహించలేక పోయినాను.

రుక్కు ఏమీ సంతోషంగా లేదు. విచార రేఖలు దాని ముఖాన్ని ఆవరించినై. పిల్లవాడికి ఏమీ తెలియదు. రుక్కు వాడ్ని తన ఒళ్లో పడుకో బెట్టుకొని, తన ఓణీచెంగు వాడిపైన కప్పింది. కోడిపిల్ల, తల్లి రెక్కలకింద ఎంత సురక్షితంగా, వెచ్చగా పడుకుంటుందో, అంత వెచ్చగా పడుకొన్నాడు వాడు దాని డొక్కలలో దూరి. గజ గజ వణికించే చలిగాలి, సన్నని వర్షపు తుప్పరను వెంట బెట్టుకొని ఎట్లాగయినా రాధాయమీద పడ దామనీ, కరుద్దామనీ, ప్రయత్నం చేసింది కాని రుక్కు తన ముఖాన్ని, వక్షాన్ని, చేతులను, కాళ్ళను, తన సర్వస్వమును అడ్డుపెట్టి, వాడిని రక్షించింది.

స్టేషనుకు చేరాము. డాక్టరుగారు కూడా మమ్మల్లను అక్కడ కలుసుకొన్నాడు. రుక్కమ్మను రాధాయను సెకండ్ క్లాసులో కూర్చో

పెట్టాము. డ్రైవరుగారు కూడా అక్కడే కూర్చున్నాడు. పిల్లవాడిని కనిపెట్టి చూస్తున్నాడు. మా పిన్ని నేనూ ఇవతల ఫస్టుక్లాసు పెట్టెలో కూర్చున్నాము. రైలు కదిలింది. నడుస్తున్నది.

ఆ రైలు రోడ్డువెంట అమ్మాయి అనేక సార్లు షికారు వెళ్ళింది. అందుకని ఆ పొడుగున ఒక మైలు దూరం వరకు చెట్లన్నీ రుక్కుకు పరిచయమైనవే. షికారు వెళ్ళిన సమయంలో అమ్మాయి ప్రతి చెట్టునూ ముట్టుకొనేది. సుపరిచితములైన, ఆ తల్లిచెట్లూ, పిల్లమొక్కలూ అన్నికూడా రుక్కును వదలలేక దీనంగా, చూడగలిగినంత సేపు చూస్తూ, కదిలి పోయినై. రుక్కు తమను వదిలి వెడుతున్నదని విచారంతో తలలు వంచుకొన్నై. కొన్ని జలజల కన్నీటి బొట్లను రాల్చినై. రుక్కు వాటిని చూస్తూ "మళ్ళీ పది రోజులలో వస్తానుగా" అన్నట్లు బలవంతంగా తెచ్చి పెట్టుకొన్న చిరునవ్వు వలన తెలియ పరిచింది.

తెనాలి చేరే సరికి వర్షం బాగా పెద్దదైంది. రైలుదిగి స్టేషనులోకి తడవకుండా వెళ్ళటం

ఎల్లాగా అని నేను అనుకొంటూ ఉండగానే, అమ్మాయితోపాటు ప్రయాణంచేసిన ఒక పెద్ద మనిషి తన ఓవర్‌కోటు తీసి రుక్కుకై కప్పి, బిడ్డను అందించాడు. రుక్కూ పిల్లవాడూ తెలివి కుండా స్పృహలోకి వచ్చారు. నేను ఆయనకు కృతజ్ఞతతో నమస్కరించాను.

ఆయన నా వంక తేరి పారజూచి రుక్కుతల్లి వైపు చూస్తూ "మీ కుమార్తె ఈ బిడ్డ! ఏమి వినయ సంపత్తి ఉందండీ పిల్లదగ్గర! చక్కని ఇంగ్లీషు మాట్లాడగలదే! నాకు చాలా సంతోషం కలిగింది. ఇంత చక్కని సుగుణవంతురాలను కన్న తండ్రీ చాలా ధన్యుడు" అని ఇంగ్లీషులో అని పిల్లలను కూడా తన కారులో ఎక్కించుకొన్నాడు మీరు వెనకాల రండి, నేను వీళ్ళ ఇద్దరిని వాళ్ళ మామయ్యగారి ఇంట్లో దిగబెడతాను అని అంటూ. డాక్టరుగారుకూడా ఆ కారులోనే వెళ్ళారు. మిగిలిన వాళ్ళము మేమంతా బండిలో ఎక్కి వెళ్లాము. మేము బండిలోనుంచి సరిగ్గా దిగే సమయానికి ఫెళఫెళమని ఉరిమింది. రుక్కు వెళ్ళిపోయింది. నేను నవ్వి ఊరుకొన్నాను...

"రుక్కు అక్కా విచారంగా ఉందే! పిల్లవాడికి పుట్టుడు జ్వరమాయె! అప్పుడెందుకు చేశావు నాన్నా నా పెండ్లి? నా పెండ్లిలో రుక్కు ఏమన్నా సరదాగా తిరిగిందా? ముచ్చటగా తిరగ గానికి వీలుఏదీ? ఎప్పుడూ ఈ జబ్బు వెధవనే కనిపెట్టుకొని ఉండాలె. "అంతే కదు బామ్మా" అన్నది సుశీ. మా పిన్ని "ఆఁ ఏం తిరుగుతుందే! ఇంకా నే చెప్పలేదూ. రాధాయ దాన్ని కదల నిచ్చే వాడు కాదని. పెండ్లి జరుగు తున్నంత సేపూ అది దిగులుగానే ఉంది" అనేటప్పటికి "ఎందుకు బామ్మా దిగులూ? రాధాయకు జబ్బుగ ఉంది అనేనా" అని శాస్త్రి అడిగాడు. వెంటనే దానికి జవాబుగా మా పిన్ని ఇట్లా చెప్పింది.

* * * * *

......రాధాయకు జబ్బుగా ఉందని కొంత దిగులు. అదీగాక మీ మామ్మా అత్తయ్యా పీటలమీద కూర్చున్నారు. తన తల్లి చేతులమీదుగా జరగాలిసిన పెండ్లి ఇట్లాగ జరగవలసి వచ్చిందేనని దానికి విచారం. బుద్ధి తెలిసిన పిల్ల ఆయె అది అప్పటికే, మీ రంటే పసివాళ్లు కాని!!

దీన్ని పెండ్లి కూతురిని చేసి, పెండ్లి పీటల పైకి తీసికెళ్ళే ముందు, వాళ్ళ అమ్మ ఫోటో ముందు నించోబెట్టి, నమస్కరించు అమ్మా, మీ అమ్మకు నమస్కరించు అన్నారు. ఇది చేతులెత్తి దేముడికి నమస్కరించినట్లు నమస్కరించింది. నేనూ, రుక్కూ దగ్గర దగ్గరగానే గది గుమ్మంలో నుంచున్నాము. చెప్తొద్దూ నాకే దుఃఖం వేసింది. ఇహ దాని మాట చెప్పాలా?

అద్దెందా! ఇంకొకటి. పెండ్లి పీటలమీద నుంచి లేచిన తరువాత అల్లుడూ కూతురూ ఇద్దరూ కలిసి వచ్చారు మీ నాన్నకు నమస్కారం చేయటానికి. పెండ్లికూతురు తల్లికీ తండ్రికీ నమస్కరించాలిసిన సమయం అది. అల్లాంటప్పుడు ఒక్కడే పీటనుంచున్నాడంటే ఎవరికి విచారం కలగదు! బుద్ధి తెలిసిన పిల్ల కాబట్టి, రుక్కు ఇవన్నీ చూడలేక మనస్సులో ఊహలు, ఇద్దైపోయింది. అయితే ఒక్కమాటన్నా పైకి అనలేదు శుభసమయంలో ఏమీ పైకి పోంగకూడదని దానికి తెలుసు. ఎంత జ్ఞానం గలదిరా అది!! దానికున్న జ్ఞానం మీ నాన్నకు కూడా లేకపోయింది నిజానికి. ఇంకా

మాం విన్ని తలవంచుకొన్నది. నేను చెప్పాలిసిన విషయం ఒకటి జ్ఞాపకానికి వచ్చింది నాకు. ఆ సమయంలో నేను చెప్పింది ఇది.

* * * * *

......అమ్మాయీ, అల్లుడూ దంపతులై నాకు నమస్కరించటానికి వచ్చారు చూశావా అప్పుడూ, వారికి ఎంతో కళవచ్చింది. ఆ దీపపు కాంతిలో అమ్మాయి కళ్ళు తళతళ మెరిసినై. అమ్మాయికి జడ వేసి జడకుచ్చిళ్ళు వేశారు. అమ్మాయి కళ్ళల్లో ఇంద్రనీల మణుల కాంతులు తళతళ లాడినై. అది పైట నడుముకు బిగించి వంగి నా పాదాలు ముట్టుకొని నమస్కరించింది. ఏవేవో దీవనలు మనస్సులో అనుకొన్నాను. పైకి అనలేను.

అప్పుడే ఒక విచిత్రం జరిగింది. ఏమిటంటే అమ్మాయీ, అల్లుడూ నాకు నమస్కారం చేస్తున్నప్పుడు నా ప్రక్కన ఎవరో ఉన్నట్లు నాకు అనుమానం కలిగింది. ఇటు తిరిగి చూశాను. మీ అమ్మ ప్రక్కనే నుంచుని ఉన్నది. తెల్లని చీరకట్టి ఆకు పచ్చని రైక తొడిగింది. కన్నులనిండా

కాటుక, కుంకుమబొట్టు ఉంది ముఖాన. ఆమె ముగముపైన ఒక చిన్న మందహాస రేఖ కనిపించింది. వళ్ళు ఝల్లుమన్నది. నేను తిరిగి చూచే సరికి ఆమె గిరుక్కున తిరిగినట్లు తోచినది. ఆమె వేసే బంధము, అందులోని పూలూ నాకు స్పష్టంగా కనిపించినై. మరుక్షణంలో ఆమె అదృశ్యం అయింది. ఏమిటా అనుకొన్నాను. ఆవిడే నా ప్రక్కకు వచ్చి నిలబడిందా లేక ఎవరైనా అక్కడ ఉంటే నేను ఇట్లాగ భ్రమపడ్డానా? అని అటూ ఇటూ చూశాను. ఎవ్వరూ లేరు. నా ప్రక్కగా ఎవ్వరైనా వెళ్ళినారా అన్నాను. ఎవ్వరూ వెళ్ళలేదు అన్నారు. ఆమె వచ్చి నా ప్రక్కన నుంచుని సూతుర్ని ఆ గ్రస్ని దీవించి పోయింది. "చిన్న అక్కయ్య పెండ్లి అయిపోయిన తరువాత మమ్ములను అందరినీ అక్కడ వదిలేసి నీవు ఒక్కడవు ముందరు వెళ్ళి పోయినావన్నమాట" అని కలినాను శాస్త్రి. నేను మళ్ళీ ఏమన్నానంటే.

* * * * *

......ఎంజేసేది నాయినా వెళ్ళక తప్పింది కాదు. ఉద్యోగం చెయ్యకపోతే పొట్ట ఎట్లా గడుస్తుందీ!

అందుకని వెళ్ళాను. అయితే నాకు ఒక ధైర్యం పిల్లలను పరాయి వాళ్ళ ఇంట్లో కాదుగదా వదిలి పెడుతున్నది, మేనమామ ఇంట్లోనే గదా అని. పోనీ మిమ్మలను అందరినీ తీసి కెడదామన్నా వీలు లేదాయె! సుమారు పదహారు రోజుల పండగ దాకా ఉండాలిసి వచ్చె. రాధాయను కదిలించ టానికి వీల్లేదుగా!! ఎటొచ్చీ, నిన్నూ ఈ విజ యనూ తీసి కెళ్ళాలె. "ఇంక పిల్లిద్దరినీ తీసుకొని వెళ్ళక పోతేనేం? పెండ్లి ఇల్లు కదా! నాలుగు రోజులు సందడిగా ఉంటారు. ఉండనియ్యి బావా" అని మీ మామయ్య కూడా అన్నాడు.

నేనూ ఆలోచించి అదే మంచిది అను కొన్నాను. మీ మామయ్య రాధాయకు మంచి మందు ఇస్తాడు. తొందరగా కూడా నయమవు తుంది. వాడికి శాస్త్ర పథ్యం తినిపించిన తరు వాతే పిల్లలను తీసుకొని పోవచ్చును అని అను కొన్నాను.

మీ రుక్కు అక్కయ్య కూడా ఆ మాటే చెప్పింది. నేను, మిమ్మలను అందరినీ వదిలి ఎల్లా

వెళ్ళేదా అని చూస్తుంటే, అది "దిగులు పడే బోకు నాన్నా ఇక్కడ మాకేం తక్కువ? మామయ్య ఇంట్లో హాయిగా ఉంటాము. వాడికి కాస్త కులాసా ఇవ్వటం తోనే నువ్వు వచ్చి నన్ను లను వెంట బెట్టికెళుదు గాని. నేను ఉత్తరం వ్రాస్తుంటాలే ఎప్పటి కప్పుడు. నీవు మాటి మాటికి పరుగెత్తుకొని రాకు ఇక్కడ రాధగాడు ఎట్లా ఉన్నాడో అన్న దిగులుతో," అని నాకు ధైర్యం చెప్పింది. వెళ్లేదిటే తల్లీ, రాధిగాడిని చలిగాలిలో తీసుకొచ్చాము. నిమోనియాయే వస్తుందో జ్వరమే ఎక్కువౌతుందో అని భయంగా ఉందే అమ్మాయియీ అని నేను అంటే అది "వాడి కొచ్చిన భయం ఏం లేదు నాన్నా. వాడి ప్రాణా నికి నా ప్రాణం అడ్డం వేస్తాను" అని నన్ను పంపింది.

నేను గుండె బరువుతోనే రైలు ఎక్కాను. ఏమిటో కారణం లేని భయం పట్టుకొంది. మన స్సును తెనాలిలో వదిలేశాను. శరీరం మటుకే బందరు వైపు ప్రయాణం చేసింది. చెట్లూ పొలాలూ, పచ్చనిపైర్లూ అందమైన వస్తువులూ

అక్క ఒక వైపుకు పోతుంటే, నేను ఒకణ్ణి ఇంకో వైపుకు పోతున్నట్లు తోచింది. బందరు చేరాకన్న ముందుగాని ఏదో అవ్యక్తమైన బాధ నా మనస్సును ఘోషించింది.

తెనాలికి పోయ్యే రైలు వైపు ఉహ చూస్తూ కూర్చునే వాడిని ప్రతి సాయంత్రమూ. ఎగురుకుంటూ సంతోషంతో పోయ్యే బడి పిల్ల వాడిలాగ పోతున్న ఆ రైలు బండిని చూస్తే నా కెందుకో ఈర్ష్యగా ఉండేది. బహుశః అది తెనాలి వైపుకు పోతున్న కారణానే! ఇట్లా అని నేను ఊరుకోగానే మా పిన్ని ఇట్లా అన్నది.

*　*　*　*　*

......"సరేగాని ఈ సంగతి నీకు తెలుసా? నువ్వు వెళ్ళిన తరువాత, ఆ రాధిగాడికి జ్వరం ఎక్కువైంది. చాలా ఎక్కువైంది. ఒక్క వారం రోజులు వాడి వళ్ళు వాడికి తెలియదు. మూసిన కన్ను తెరవలేదు.

ఓయి భగవంతుడా ఇదేం ఖర్మంరా అనుకొన్నాము. సత్యం కూడా హడలి పోయినాడు.

ఏంరా, ఎంత భయపడ్డావు నీవు...అని మా చిన్ని సత్యం వంక చూచింది. సత్యం తలవంచుకొనే చెప్పాడు ఈ సంగతి పిల్లలను చూస్తూ.

* * * * *

......మీ నాన్నకు ఈ సంగతి తెలియదు. అప్పుడు చెప్పలేదు. దాని తరువాత చెప్పటం పడలేదు. ఏమిటీ అంటే రాధాయకు ఆ జ్వరం లోనే రక్తవిరోచనాలు పట్టుకొన్నాయి. ఇంతింత రక్తం పడేది. వాడి వయస్సు ఎంత!! వాడెంత!! రక్తస్రావాన్ని ఆపటానికి ఎంతో ప్రయత్నం చేశాను. లొంగలేదు. డాక్టరు రామారావు గారితోనూ ఉళక్కిగారితోనూ ఆలోచించాను. ఇన్‌జెక్షన్‌లు చాలా ఖరీదైనవి ఇచ్చాను. అదేమి చిత్రమో లొంగలేదు.

నేను పడుతున్న అవస్థ అంతా రుక్కు చూస్తునే ఉంది. గ్రహించకుండా ఎల్లా గ ఉంటుంది? వాడు నడి సముద్రంలో ఉన్నాడని తెలుసు కొన్నది. ఇక రాత్రింబవళ్లూ అది చేసిన చాకిరీ ఇంతా అంతా కాదు. ఏ రాత్రి

వేళ చూచినా అది ఏదో పని చేస్తూనే ఉండేది. రక్తంతో తడిసిన ఆ బట్టలన్నీ తీయటమో గంట గంటకు మందు ఇయ్యటమో, ఏదోపని చేస్తూం డేది. ఎప్పుడన్నా కాస్త విరామం దొరికి నప్పుడు, అది ఆ మంచపు పట్టెమీద తల ఆనించి వాడ్ని రెండు కళ్ళతోనూ చూస్తూ ఉండేదే కాని నిద్ర పోయేది కాదు.

నువ్వు కాస్త నిద్రపోవే రుక్కూ. ఇల్లాగ అయితే నువ్వు మంచాన పడతావే. నువ్వు కూడా మూలపడితే ఎట్లా చెప్పు. నువ్వు ఆరో గ్యంగా ఉండబట్టికదా వాడికి కాస్త పనికి వచ్చావు! నీ స్వ ఆరోగ్యం చెడగొట్టుకొంటే తమ్ముడికి ఎంత ఇబ్బంది!! మాకెంత కష్టం! నువ్వుపలు చిక్కినప్పుడల్లా కాస్త కునుకు తీయాలె అని నేను చెప్తే "అది సరే, మామయ్యా వాడు ఎప్పుడు కళ్ళు తెరిచి అక్కయ్యా అంటాడో! అప్పుడు నేను వాడికి కనపడొద్దూ? వాడు ఎప్పుడు అక్కయ్యా మంచినీళ్ళు అంటాడో, ఎప్పుడు అక్కయ్యా ఆకలౌతుంది అంటాడో!! ఎట్లా నిద్ర పోయేది. చెప్పు? అసలు నిద్ర పడుతుందా నేను పోవాలనుకొంటే మటుకు!" అనేది.

"ఎట్లాగే రుక్కు అల్లాగ అయితే? పోనీ మేము ఎవ్వరమైన ఉంటాముగా వాడి కేమి కావలసినా ఇవ్వటానికి" అంటే—"మీరెవ్వరూ వద్దు. అమ్మ వాడిని నా చేతిలో పెట్టి నేను వాడి విషయంలో ఏమీ లోపం చెయ్యనని నమ్మకంతో నిశ్చింతగా పోయింది. నేను కళ్లుమూస్తే వాడికి ఏ లోపం జరుగుతుందో! అంటే మీరు లోపం చేస్తారని కాదు మామయ్యా. నా మనస్సుతృప్తి కోసం ఇల్లాగ చేస్తాను నువ్వేమీ అనుకోకు. నాకు జబ్బు చేస్తుందని నీవు భయపడవద్దు. ఎందుకు చేస్తుందీ? నేను తిప్పలపని చేయటం లేను. అమ్మ చెప్పిన పని చేస్తున్నాను. నాకు జబ్బు చెయ్యదు" అనేది. అట్లా మాట్లాడుతూ ఉంటే ఏమంటాము. వాడికి నిజంగా చాలా బలహీనంగానే ఉంది. వెధవది అనకూడదు గాని ఒకరోజున వాడిమీద ఆశలు వదులుకొన్నాను... ఇల్లా అని సత్యం రాధిగాడ్ని తన దగ్గరకు లాగుకొని తలమీద చెయ్యివేసి ముద్దుగా నిమురుతూ ఊరుకొన్నాడు—ఇంతవరకూ ఒక్కమాట అయినా మాట్లాడకుండా వింటూ కూర్చున్న పంకజమ్మగారు, మా పిన్నికి దగ్గరగా జరిగి మా అంద

లికి నల్లగా చెప్పింది.

*　*　*　*　*

......రాధాయకు జబ్బుగా ఉన్నప్పుడు నేను అక్కడే ఉన్నాను మీాకు జ్ఞాపకం ఉందో లేదో. మీా వాళ్ళ యింటికి ప్రక్కనే. ఈ పిల్లవాడికి ఒలువుగా ఉండన్న తరువాత నేనూ అప్పుడప్పుడు వచ్చి, తుక్కకు తోడుగా కూర్చునే దాన్ని. ఏం పిల్లమ్మా రుక్కు!! సలభై అయిదేండ్లు వచ్చినై నేనూ పిల్లలు గలదాన్నే గాని అంత ప్రేమ నేను ఎక్కడా చూడలేదు. అమ్మా తల్లి అయితే మటుకు అట్లా చేస్తుందా? ఏమో నబ్బా నాకు నమ్మకం లేదు. అంత చిన్నపిల్ల అయినా ఎంతో నిబ్బరంతో ఉండేది! వాడు ఇటునుంచి కాస్త అటు పొర్లితే చాలు. వాడిమీాదకి వంగి, "నాయినా రాధా ఏం కావాలరా?" అనేది ఎంతో ముద్దుగా, అనేకసార్లు—తెల్లవార్లూ అది అట్లా మేలుకొనే ఉండేది వాడిని వెయ్యి కళ్ళతో చూస్తూ.

అది అట్లా ఉంచండి. అసలు సంగతి చెప్ప లేదు మీాకు. సత్యం అన్నాడు చూశారూ, ఒక

రోజున ఆశలు నగలు కొన్నాము అని. ఆ మాట నిజమే! వాడు చెప్పలేక పోతున్నాడు కాని ఆ రోజు ఆశలేమిటి అన్నీ నగలుకొన్నాం. ఇంకో సంగతి చెప్పనా! ఆ రోజున రాత్రి ఎనిమిది గంటలకు డాక్టరు రామారావుగారు నన్ను బైటికి పిలిచి రుక్కు వినకుండా అన్నాడు. "పిన్నిగారూ కాస్త మీరు ఈ రాత్రి కనిపెట్టి ఉండాలె. ఈ రాత్రి గడవాలె. కాస్త ఉండండి. మీరు ఇక్కడే ఉండండి ఈ రాత్రి" అని. నేను ఉండి పోయినాను. "పిల్లవాడి మాటలు ఏమీ బాగా లేవు ఏమిటి పిన్ని అట్లా ఉన్నాడు తమ్ముడు!!" అని అడిగితే పసిదానికి అమ్మా మరేం ఫరవాలేదు అని నేను చెప్పాను. కాని అది గ్రహించింది.

"పిన్నిగారూ, మా అమ్మ వీణ్ణి నాకు అప్పజెప్పింది కాపాడమని. నేను నా మాట నిలుపుకోలేక పోతే అమ్మ ఏమనుకొంటుంది!" అని బాధపడుతున్నది పిల్ల. నేను రుక్కును ఓదార్చి, ఏం జేస్తానమ్మా? నీవు ఎంత సేవచేశావు తల్లీ! అయినా వాడికి మరేం ఫరవాలేదు అన్నాను.

చేశానండి పిన్నిగారూ, ఇంకేం జేసేది అని జాలిగా చూస్తే, ఏం ఫరవాలేదు. నీవు ఊరికే దిగులు పడక, భగవంతుడ్ని ప్రార్థన చెయ్యి అన్నాను.

ఈ మాట వినేసరికి రుక్కు కళ్ళల్లోకి తళ తళలు వచ్చినై. ఏదో అనుకొంది. నా వంక తిరిగి "పిన్నిగారూ నేను తమ్ముడికి ఆరోగ్యం ఇయ్యమని నా తల్లి పార్వతీ దేవిని ప్రార్థించి వస్తాను. మీరు ఇక్కడే ఉండి వీడిని చూస్తూ ఉండండి అని లోపలికి పోయింది. అది ఏం చేస్తుందో అని నేను కనిపెట్టి చూస్తూనే ఉన్నా.

అది బావి దగ్గరకెళ్ళి కాళ్లూ చేతులూ మొఖం కడుక్కొని, ఆ బట్టలు విడిచి, ఉతికిన బట్టలు కట్టుకొని ఒక్క అరగంటసేపు దేవిదగ్గర కూర్చుంది.

రుక్కు మళ్ళీ వచ్చేసరికి దాని ముఖంలో విచారం అంతా మాయమైంది. మొఖంలోకి ఏదో కొత్త కాంతి వచ్చింది. రావటంతోనే ఏమన్నదో తెలుసునా? "తమ్ముడికి ఇంకా భయం లేదమ్మా పిన్నీ—వాడు బ్రతికాడు. దేవికి అను

గ్రహం కలిగింది" అన్నది. పోనీలే అనాన్న సంతోషం అన్నాను.

మర్నాడు రామారావుగారు వచ్చి రాధాయను చూచి ఆశ్చర్యపోయి, "చాలా చిత్రంగా ఉందండీ పిన్నిగారూ ఇంత సుగుణంగా ఉండటం ఎట్లా సంభవించిందో!! చాలా విచిత్రం. ఇది మా మందుల పనికాదు. వాడి అదృష్టం. వైద్య శాస్త్రము ప్రకారం వీడు ఇట్లా ఉండాలిసింది కాదు. ఏదో గారడీ జరిగినట్లు మార్పు వచ్చింది" అన్నాడు. అదంతా రుక్కమ్మ ప్రార్థనలకు ఫలితోమేనని నేను మనస్సులో అనుకొన్నాను. ఏం పిల్ల రుక్కు!! బంగారు తల్లి!! మందులు చేయలేని పని ప్రార్థనలు చేసినై. నిజం చెప్పాలిసి నచ్చే రుక్కే తమ్ముణ్ణి బ్రతికించింది... ఈ మాటలు విని ఆపడ కూడా సత్యం పక్కనే ఉన్న రాధాయ పెదవిమీద ఒక చిన్న చరుపు చరిచింది ప్రేమగా. రాధాయ రుక్కు ఫోటో వంక చూచి కృతజ్ఞతతో తల వంచుకొన్నాడు. గడియారం పన్నెండు గంటలు కొట్టింది. గాలి రొద చేయటం మాని మారాన ఎక్కడో మూల్గుతున్నది. ఒక్క నిమిషం అంతా నిశ్శబ్దంగా కూర్చున్నాము.

“రాధాయను ఎవరన్నా ఏమన్నా అంటే రుక్కు మనస్సు ఎంతో కష్టపడేది. అది వ్రాసిన ఉత్తరాల్లో ఈ విషయం స్పష్టంగా కనపడుతుంది” అన్నాను నేను పిల్లలతో. “ఆ ఉత్తరాలు నీ దగ్గర ఉన్నయ్యా నాన్నా” అని అడిగాడు శాస్త్రి. నేను ఉన్నాయి అన్నాను. ఉన్నాయి అనేసరికి అందరి ముఖాలూ వికసించినై. అందరి ముఖాలలోనూ ఆతురత కనపడ్డది.

చివరకు సుశీ “ఆ ఉత్తరాలు తీసి చదువు నాన్నా వింటాము” అన్నది. పిల్లలందరూ అల్లాగే అన్నారు. సరే ననుకొని, రుక్కు వ్రాసిన ఉత్తరాల్లో రెండు మాత్రం తెచ్చాను. మొదటి ఉత్తరంలో ఏమీ విశేషాలు లేవు. రాధాయకు నయం అయిందని సంతోషిస్తూ వ్రాసిన ఉత్తరం అది అన్నాను. “ఆ రెండోదీ కూడా చదువు నాన్నా” అంటే చదివాను ఇల్లాగ.

......“రాధాయకు జ్వరం తగ్గింది. పండ్ల రసంతో పాటు కాచిన పాలుకూడా ఇస్తున్నాము. దేవి కృపవలన రాధాయ బ్రతికాడు. చాలా

సంతోషంగా ఉంది. నీవు అనవసరంగా భయ పడతావని నీకు వ్రాయలేదు. వాడికి ఈ మధ్య నాలుగు రోజులు చాలా ఎక్కువ చేసింది. ఇప్పుడు ఆతుర్దా ఏమీ లేదు. ఇంకో వారానికి పథ్యం పెడతారు. రాధాయ అప్పుడే గోల పెడు తున్నాడు అన్నం తింటానని. పాపం ఆకలవు తున్నది కాబోలు! మామయ్య ఇంకో వారం అయినా ఆగమంటున్నాడు. వీడు ఆగటం లేదు. మామయ్య ఇంట్లో ఉన్నంతసేపూ ఏమీ మాట్లా డడు. ఆయన అలా వెళ్ళటంతోనే నన్ను పట్టు కొని ఏడుస్తాడు అన్నం పెట్టించమని. ఆ మాటా ఈ మాటా చెప్పి ఎల్లాగో రోజులు గడుపు తున్నాను.

మనము ఇంతవరకు అదృష్ట వంతులము. ఇంతకైన మగబిడ్డ బ్రతికాడు. మనవాళ్లు ఎవ్వరు వచ్చినా ఆ మాటే అంటున్నారు. ప్రతివాళ్ళు వచ్చి, రాధాయ బుగ్గగిల్లి, "మార్తండుడే! ఎంత పాటు పడ్డావురా నాయినా! ఆ భగవంతుడు సద్దా చూశాడు. అదృష్ట వంతుడివి" అని ఎల్లాగ అని ముద్దు పెట్టుకొని సంతోషలమో

వాడి చేతులో పెట్టి పోతున్నారు. వాడు మళ్ళ నలుగురిలో పడ్డందుకు ఎంతో సంతోషంగా ఉంది ''......

రెండో ఉత్తరం ఇది. ఇందులో సత్యం అత్తగారు అన్నమాటలు రుక్కు నవనీత హృదయాన్ని ఎంత కలత పెట్టినయ్యో తెలుస్తుంది అన్నాను. వాళ్ళు చదవ మన్నారు. ఇల్లాగ చదివాను.

......“నాన్నా రాధాయికి బాగా ఆరోగ్యం కలుగుతున్నది. నాకూ మామయ్యకూ కూడా మాట దక్కింది. కాని రాజమ్మ బొమ్మ అనే మాటలు మటుకు నా గుండెల్లో శూలాలలాగు గుచ్చుకొంటున్నై ''......

ఇంతవరకు చదివి ఆగాను తన అత్త గారు అన్న ముళ్ళ మాటలను గురించి చదివితే వాడికేమైనా కష్టంగా ఉంటుందేమోనని. ఆగి వాడి వంక చూశాను. వాడు గ్రహించాడు. గ్రహించి అన్నాడు.

సంవత్సరానికో రెండు సంవత్సరాలకో ఒకసారి చుట్టపు చూపుగా రావటం ఎక్కడైనా ఉంది. ప్రతి సెలవలకూ వచ్చి ఇక్కడ తిష్ఠవేసి కూచుంటున్నారు! వీళ్ళకు కాఫీలకు ఉప్మాలకు బోలెడు ఖర్చు అవుతున్నది. మా అల్లుడేం మహారాజా, పోనీలే అనుకోవటానికి!! అదీగాక వీళ్ళ అందరికీ నా కూతురే చెయ్యాలిసి వచ్చె!'' అని రాజమ్మ గారికి కడుపు మంట. అదీ అసలు సంగతి. లోపల ఆ కోపం ఎప్పుడూ రాజుతూ ఉంటుంది ఆవిడకు. అందుకనే, అల్లుడి బావగారి పిల్లలనూ చూస్తే ఆవిడకు కోపం. రుక్కుతో కఠినంగా మాట్లాడటానికి ఇదీ కారణం......ఆ తరువాత మా పిన్ని ఇల్లా అన్నది.

* * * * *

నీవు చెప్పింది లోకంలో సంగతేనమ్మా. అంతటితో ఊరుకొంటే నయమే! ఊరుకొన్నదా? మా కోడలు బ్రతికి ఉన్నన్నాళ్ళూ, దాన్ని తిట్టి పోసింది. ఆ సంగతి నాకు తెలుసు. విన్న వాళ్ళకు తెలుసు. సత్యానికి మటుకు తెలియదు. ఎట్లా తెలుస్తుందీ? ఎవరు చెపుతారు! వీళ్ళను

రానీయ్యొద్దని కూతురుకు చెప్పేదేనమ్మా !! కూతురు మొగుడితో చెపితే వాడు వినేవాడో, అసలు చెప్పనే లేదో మనకు తెలియదు. మొత్తం మీద తపస్సు చేసిందమ్మా వీళ్ళు రాకుండా ఉండాలని ! ఆవిడ తపస్సే ఫలించింది. భగవంతుడు నా కోడలును తీసుకు పోయినాడు. అంతటితో ఆవిడ మనస్సు శాంతి పొందింది...అని మా పిన్ని కళ్ళ నీళ్లు పెట్టుకొన్నది. పంకజమ్మగారు మళ్ళీ ఇట్లా అన్నది.

*   *   *   *   *

అత్తా రాజమ్మగారి నోరు మంచిది కాదని, అందరికీ తెలుసు. అయితే మటుకు ఆవిడ అన్నంత మాత్రాన అంతపని జరగాలని ఉందా ? నీ కొడుకు చేసుకొన్న కర్మ ! పిల్లల దౌర్భాగ్యం ! ఆవిడ శపించిందని అనుకొంటే ఏమి ప్రయోజనం ! రుక్కూనూ అట్లాగే ఏదో అని ఉంటుంది. ఆవిడ స్వభావం ఎవ్వరికి తెలియదు !! అది సరే, సత్యం ఏమీ అనుకోకుగాని ఆ ఉత్తరం చదువు...అని పంకజమ్మగారు నా వంక చూచింది. నేను చదివాను.

*   *   *   *   *

……"నాన్నా! రాధాయకు జ్వరం నయమైనందుకు అంతా ఎంతో సంతోషిస్తున్నారు. కాని బొ అమ్మ మటుకు ఎందుకో ముఖం ముడుచుకొని తిరుగుతున్నది. పడిలేచిన పిల్లవాడిని ఒక్కసారి అయినా మాట్లాడించ లేదు. రాధాయ అన్నం తింటానని మారాం చేస్తుంటే "తిందువుగాని లే, ఏం తొందరా! ఇహ తినక ఏం జేస్తావ్" అని కర్కశ కంఠంతో అంటుంది.

నేను కాస్త ఎందుకైనా గుమ్మం అవతలకు వెళ్ళితే రాధాయ పెద్దగా ఏడుస్తాడు. పసివాడు ఏడుస్తున్నాడని రాజమ్మ బొమ్మ జాలి పడదు. ఎందుకురా నాయినా ఏడుస్తావు అనదు. పైగా కొరకొర జూచి "ఏల, ఎందుకూ అల్లాగ ఏడుస్తావు? గేదెలాగ అరుస్తా వెందుకూ? మామయ్య ఇచ్చిన ఖరీదుగల మందులన్నీ మింగావు. ఇల్లు సగం గుల్ల అయింది. ఇంకా ఎందుకు ఏడ్పు?" అంటుంది.

ఇల్లాగ ఆవిడ అంటూ ఉంటే సూదులు పెట్టి పొడిచి నట్టుగా ఉంటుంది నాన్నా నాకు!!

పసివాణ్ణి అల్లాగ ఎందుకు అనాలె. పైగా ఈ మాటలన్నీ అమ్మ పక్కనే ఉన్న గది గుమ్మంలో నుంచుని అంటుంది. అమ్మగారిని దుఃఖ పడుతూన్నట్లు తోచి, నా హృదయంలో బాధ కలుగుతున్నది. మామయ్యకి ఈ సంగతంతా చెబుదామని అనుకొన్నాను. గాని మళ్ళీ, ఎందుకు పాపం ఆయాన మనస్సు కష్టపెట్టటం అని ఊరుకొన్నాను. ఎందుకని చూస్తున్నా. నన్ను ఏమైనా అన్నా నేను భరిస్తాను గాని, రాధాయను ఈ తభా ఏమన్నా అంటే నేను ఊరుకోను. మామయ్యతో చెబుతాను.

మామయ్య మాటకు మమ్మలను ఎంతో దయతో చూస్తున్నాడు. రాధాయ బత్తాయి రసం తాగుతూ ఉంటే మామయ్య నుంచుని ఊరికే తృప్తిగా ఆనందంగా చూస్తాడు. ఆ చూపుల్లోనే కనపడుతుంది ఆయాన మనస్సులోని ప్రేమ అంతా. నీవు కొందరవనీ రావనీ నైలు కిర్చులు దండుగ పెట్టుకోకు. రాధాయకు పథ్యం పెట్టటంతోనే ఉత్తరం వ్రాస్తాను. అప్పుడు రా! మమ్మను తీసి కెళుదువు గాని ''.....

ఉత్తరం చదవటం పూర్తి అయింది. సుశీ శాస్త్రీ, రాధా, విజయా అంతా అన్నారు ఒక్క గొంతుకతో—"రాజమ్మ బొమ్మ అల్లాగ పుల్లా మతూ మేము ఉండటం బొత్తిగా ఇష్టం లేనట్టు చెబుతోన్నప్పుడు వెంటనే మమ్మలిని తీసుకు రాక పోయినావా బండరు? అక్కడ ఎందుకు ఉంచావు నాన్నా మమ్మల సంవత్సరం?" అని అడిగారు. నేను చెప్పక తప్పింది కాదు. ఇల్లా చెప్పాను మళ్ళీ.

* * * * *

......నాయినా, రుక్కు దగ్గరనుంచి ఉత్తరం వచ్చిన మర్నాడే మీ బామ్మ, శాస్త్రీని, సుశీని, పాపను వెంట బెట్టుకొని వచ్చింది. "ఏమమ్మా ఇంకా నాలుగు రోజులుండే, అయిదుగురు పిల్లలను తీసుకొని రాక పోయినావా?" అన్నాను.

"ఛీ. ఆ ఉన్నంత నరకం ఇంకొకరోజు లేను. రాజమ్మ మో చేతికింద నీళ్లు తాగినదాకా నాకేం కర్మం! నిన్న ఆవిడే అన్నది "రుక్కూ, రాధా వెనకనుంచి వస్తారు, మీరెందుకమ్మా ఇక్కడ

ఉండటం!" అని. ఆ తరువాత ఒక్క క్షణం అయినా ఉండటానికి బుద్ధి పుట్టలేదు వెంటనే బయలు దేరాను" అని మీ బామ్మ చెప్పింది.

ఇక రుక్కూ గాథే అక్కడ ఉండి పోయిందల్లా! వాళ్ళనయినా వెంటనే తీసుకొద్దామను అనుకొన్నాను. మీ బామ్మకూడా, "వెళ్ళరా తొందరగాను చెప్పు శుక్రవారం నాడే పథ్యం పెడదా మనుకొంటున్నాను. ఒకవేళ పెట్టకపోతే శనివారం నాడు నీవే దగ్గర ఉండి, వాడికి కాస్త పథ్యం నాలికకు రాయించి వెంటనే తీసుకొనిరా. అక్కడ పిల్లను ఉంచటం నాకు ఏ మాత్రం ఇష్టం లేదు అని కూడా చెప్పింది

సరే వెళ్ళుదామని అనుకొన్నాను. ఆ రోజు సాయంత్రమే బజారుకు పోయి రెండు జరీ చీరలు కొన్నాను. సుశీ పెళ్ళిలో అమ్మాయిని చీర కట్టుకొంటే చూశాను. అంతకు ముందు ఎప్పుడూ అమ్మాయి పరికిణీలు కట్టుకొని ఓణీలు వేసుకొనేది. ఆ అమ్మాయి చీర కట్టుకోంగా చూడటం అదే మొదటిసారి. రుక్కుకు చీర ఎంతో అందంగా

ఉంది. మళ్ళీ ముమ్మూర్తులా తల్లిలాగే ఉంది రుక్కు. నీవు ఇహాముందు చీరెలే కట్టుకోవే అమ్మాయీ అని అన్నాను కూడా అప్పుడు. 'నేనూ అదే అనుకొంటున్నాను నాన్నా. రెండు చీరలు కొని ఇయ్యి' అన్నది. అందుకని అమ్మాయి కట్టుకొంటే చూచి సంతోషిద్దామని రెండు వెడల్పైన జరీ గలవి ఉప్పాడ చీరలు కొన్నాను. మా పిన్ని కూడా వాటిని చూచి ఎంతో సంతోషించి "వాళ్ళ అమ్మ పేరు పెట్టి కట్టుకోమను" అని కూడా అన్నది. ఇట్లాగ కొనవలసినవి అన్నీ కొనుక్కొని ఇహ రేపు వెడదామని అనుకొంటున్నాను. ఇంతలో తెనాలినుంచి టెలిగ్రాం రానే వచ్చింది.

శుక్రవారం ఉదయం స్కూలుకు వెళ్ళ బోతున్న సమయానికి క్షురవాడు ఒకడు వచ్చి "మీకు టెలిగ్రాం వచ్చిందండీ మాస్టారూ. మెసింజర్ వాకిట్లో ఉన్నాడని చెప్పాడు. టెలిగ్రాం అనేసరికి ఎందుకో విపరీతమైన భయం వేసింది. దుఃఖ భారంతో క్రుంగిపోయిన హృదయంలో చీకటికోనలలో మూలమూలల అణగి దాగి

ఉన్న భయాలన్నీ, నిజ రూపాలతో ప్రత్యక్షమైనై.

వణుకుతూ ఉన్న చేతుల్తో, దడదడా కొట్టుకుంటూన్న గుండెతో, మూసుకు పోతున్న కళ్ళను బలవంతంగా తెరిచి కవరు విప్పి చూశాను.

'దుర్గకు జ్వరగం, — ఆదుర్దా కలవరిస్తున్నది...బయలు దేరి రా' మామూలు జ్వరం అయితే టెలిగ్రాం ఇచ్చేవాడు కాడు. ఇదేదో విషజ్వరం అయిఉంటుంది. దాని దగ్గరనుంచి ఐదు రోజుల క్రితమే ఉత్తరం వచ్చింది. ఇంతలో జ్వరం రావటం, ఆదుర్దా కలిగించే స్థితిలోకి దిగటం చాలా ఆశ్చర్యం కలిగించినై.

ఎంత నిలవ దొక్కు కుందామని ప్రయత్నం చేసినా ధైర్యం నిలవలేదు. కాళ్ళు గజగజ వణికి పోయినై. ఈ మాట విని మా బామ్మ నిలువునా నీరై పోయింది. వారంతా కళ్ళ ముఖాలు వేసికొని నుంచున్నారు.

మా పిన్ని ధైర్యం తెచ్చుకొని చివరకు అన్నది "నిలబడితే ఏమైనట్లూ? ఇప్పటికే పది

అయింది. పదకొండు గంటల బండికి పరుగెత్తు" అని.

కోటు విప్పి కుర్చీమీద విసరికొట్టి, పైన ఉత్తరీయం వేసుకొని, పెట్టెలోనుంచి పదిహేను తీసుకొని వేగంగా వెళ్ళి జట్కా ఎక్కాను. రైలు కదలటానికి సిద్ధంగా ఉంది. ఎట్లాగో టిక్కెట్టు తీసికొని ఉరుకులు పరుగులమీద రైలులో పడ్డాను. రైలు కదిలేసరికి నా గుండె గుభేలు మంది. మనస్సు పాపిష్ఠిది! మనస్సు ఊహించిన పాపపు సంగతులు పరమ శత్రువైనా ఊహించడు. రైలు ఎప్పుడు వెళ్ళి తెనాలిలో పడుతుందా అని దిగులుతో కూర్చున్నాను.

నా మనస్సు రైలుకంటె వేగంగా పరుగెత్తింది. ఏవో పిచ్చి భయాలు నా చుట్టూ దయ్యాలలాగ తిరిగినై. ఈ భీకర పిశాచాకారాలు నా తల చుట్టూ నృత్యం చేసి వికటాట్టహాసం చేసినై. ఇట్లా ముసురుకొన్న ఊహాలను కొన్నిటిని గొంతు పిసికిచంపి అవతల పారేశాను. అవి చావక లేచివచ్చి, నా మనస్సు చుట్టూ తన్న

శల్యాలతో, జీర్ణ గూపాలతో, శ్మశాన వాటిలో ప్రళయ రుద్రుని వెంట నృత్యం చేసే భూత, ప్రేత, పిశాచాల్లాగ గిరగిర తిరిగినై. కొంత సేపటికి వాటిలో కొన్ని నా తలలో దూరినై.

గట్లను ఒరుసుకొని మహావేగంతో పోయే సెల "ఏరులాగ, నా మనస్సు శుభము, అశుభము అను రెండు తలములనూ తాకుతూ ఊహా భూము లలో పరుగెత్తుంది.

అమ్మాయి అపాయ స్థితిలో ఉందని ఒక సారి తోచేది. కులాసాగా ఉందని మరుక్షణంలో తోచేది. జ్వరం వచ్చినంత మాత్రాన ఇంత ఖంగారు పడటం నా తెలివి తక్కువ తనం అని అనుకొని శూన్య మనస్సుతో కూర్చున్నాను.

ఆ రోజున రైలు ఎక్కా నడిచిందో నాకు తెలియదు. నా బుద్ధి ఏమీ గ్రహించే స్థితిలో లేదు. తెనాలి అన్న మూడు అక్షరాలు గుర్తు పట్టే శక్తి తప్ప మిగిలిన శక్తులన్నీ నశించినై. 'తెనాలి' అని కనపడటంతోనే దిగాను. నా కోసం డాక్టరు చలపతిగారు రైలు దగ్గరకు

వచ్చారు. ఆయన దగ్గరకు పరుగెత్తి వెళ్ళి అడిగాను "ఏమండీ, మీరు ఎప్పుడు వచ్చారు ఈ వూరు? ఎట్లా ఉంది" అని. ఆయన నా భుజంపైన చెయ్యివేసి "ఆతుర్దా పడాలిసిన అవసరం లేదు. సత్యం మీకు అనవసరంగా గాబరా పడి, వైరు ఇచ్చాడు. రండి వెళ్ళదాము మాట్లాడుకుంటూ" అని తీసి కెళ్ళాడు. దార్లో నాకు చలపతి రావుగారు ఇట్లా చెప్పారు "అంత అతుర్దా ఏమీ లేదు. నేను ఒక పనిమీద ఈ వూరు వచ్చాను నిన్న. మీ వాడు ఇవ్వాళ పొద్దున కనపడి, రుక్కుకు జబ్బుగా ఉందనీ, వైరిచ్చామని చెప్పాడు. సరేనని వెళ్ళి పిల్లను చూశాను. ప్రొద్దుటి నుండీ అక్కడే ఉన్నాను. మీరు వస్తే దగుండా మనుష్యులు. ఏమి గాబరా పడతారో అని ఇల్లాగ వచ్చాను. మీ బిడ్డకు వచ్చిన భయం ఏమీ లేదు" అని ఆయన చెబుతూ ఉంటే ఆ మాటలు వింటూ నేను ఇంటి వైపుకు నడిచాను. నేను వెళ్ళేసరికి అది మంచం మీదే ఉంది. దానికి జ్వరం ఎప్పుడు వచ్చిందంటే...అని నేను చెప్పబోతుంటే పంకజమ్మ గారు నా మాటకు అడ్డొచ్చి ఈ విధంగా చెప్పింది.

*　　*　　*　　*　　*

......మంగళ వారమే! కాదు కాదు. సోమ వారం నాడే పిల్లకు జ్వరం తగిలింది. నేను అక్కడే ఉంటినిగా! ఆ రోజు ఎవరింటికో పేరం టానికి వెళ్లాలిసి వచ్చింది. రానన్నదమ్మా బిడ్డ. నేను రాధాయను వదిలి రానన్నది. ఇంకా ఎందుకే వాడి దగ్గర నిద్ర! వాడు కులాసాగానే ఉన్నాడాయె. వెళ్ళిరాండ్రా, అని మేమంతా అంటే వచ్చింది పాపం. ఏ వాకిట్లో కళ్ళు పడ్డాయో, ఇంటి కొచ్చి రావటంతోనే అన్నది, కన్ను వళ్ళు నొప్పులుగా ఉన్నాయీ అని. వంటి మీద చెయ్యి వేసి చూస్తును కదా వళ్ళు పేలి పోతున్నది. ఇన్ని మొరప కాయలూ ఉప్పూ చుట్టూ తిప్పి పొయిలో వేశాననుకో! కాని దృష్టి కాదు, జ్వరమే వచ్చింది! జ్వరం అనేసరికి పాపం సినసి, సత్యం కూడా హడిలి పోయినాడు......

అని పంకజమ్మగారు ఆ కథ ఆపింది ఎందుకో. కుతూహలంతో డాక్టరుగారు ఆ విషయాన్ని ఎత్తు

కొని చెప్పాడు.

*        *        *        *        *

......నిజమే ఆ మాట సత్యానికి చాలా భయం వేసింది- దానికి కారణం ఇది. ఆ పిల్ల ఇరవై నాలుగు గంటలూ టైఫాయిడ్ జ్వరం వచ్చిన పిల్ల వాడి దగ్గర పడుకొన్నది. ఆ ఇన్‌ఫెక్షన్ నే దీనికి అంటింది. నేను మొదటిసారి తెనాలి వెళ్ళినప్పుడే సత్యంతో చెప్పాను. ఈ పిల్లకు యాంటి టైఫాయిడ్ ఇన్‌జెక్షను ఇయ్యి, ఇది ఇన్‌ఫెక్షన్ కాచ్ చేస్తుందేమోనని. ఆ కర్మం చూడండి సత్యం ట్యూబ్సు తెప్పించి పిల్లలందరికీ ఇచ్చాడట. ఈ పిల్లకు కూడా ఇయ్యబోతే అది అన్నదట: "మామయ్యా ఇన్‌జెక్షన్ పుచ్చుకొంటే జ్వరం వస్తుందేమో, ఇవ్వాళ నేను పూజ చేసుకోవాలె, శుక్రవారం, రేపు ఇద్దువుగానిలే" అని సరే రేపు ఇద్దామనుకొన్నాడు. మర్నాడు ఎందుచేతో ఇయ్యలేదు. ఏదో అశ్రద్ధ అయిపోయింది. రెండు రోజులు గడిచినై. సోమవారం నాడు జ్వరం రానే వచ్చింది. ఇంతకూ అది కర్మం అనుకోవాలె. కాని ఒక్క తమాషా ఏమిటంటే;

ఆ జ్వరం మామూలుగా రాక పెద్దపెట్టున ఒక్క నూట అయిదో నూట ఆరో వచ్చిందట!

దాని తరువాత సత్యం నాతో చెప్పి ఎంతో విచార పడ్డాడు. "అయ్యో, ఆ ఇన్‌జెక్షన్ ఇస్తే, నీసకీ జ్వరం రాకపోయేదేమో. వెంటనే మర్నాడు ఇయ్యక పోవటం ఎంత పొరపాటు అయింది! రాధాయ జ్వరంలో రాత్రింబవళ్లూ విశ్రాంతి లేకుండా పనిచేసింది. వద్దే అమ్మా మేము ఉంటామే నీవు కాస్త పడుకో అంటే విన్నదా! అట్లా చేసింది. నీరసించి పోయింది. దానిపైన ఈ భయంకరమైన జ్వరం వచ్చిందే!" అంటూ సత్యం ఎంతో గోల పెట్టాడు...అని డాక్టరుగారు చెప్పాలిసింది చెప్పారు. ఆ తరు వాత సత్యం అందుకొని ఇల్లాగ చెప్పాడు.

* * * * *

......నాలుగు రోజులు నేనే మందు నడిపాను. కాని అయిదో రోజు దానికి కడుపులో నొప్పి వచ్చింది. పరీక్ష చేశాను. ఊపిరి తిత్తులలో

మబ్బు కనపడ్డది. నిమోనియా అని నిశ్చయించు కొన్నాను.

ఆ తరువాత నేను మందు నడపలేను. రామారావు గారిని, ఉపకిల్లా గారిని పిలిచి వాళ్ళకు అప్ప చెప్పాను. వాళ్లైనా గొప్ప అనుభవం కల వాళ్ళు. వాళ్లెందుకు పొరపాటు చెయ్యాలా!

రామారావుగారు ఇది మలేరియా జ్వరం అని అభిప్రాయం పడ్డాడు. నేను కాదు, ఇది టైఫాయిడ్, రాధాయి దగ్గరనుంచి అంటుకొన్న దని ఎంత చెప్పినా వినలేదు. ఆయన ఏవో కొన్ని గట్టి కారణాలు చూపాడు. ఉపకిల్లా గారుకూడా మలేరియాయే అయి ఉంటుందన్నారు. ఇద్దరూ కలిసి మలేరియా అని క్వినైన్ మందు పెద్ద డోసులో ఇచ్చారు.

ఆ క్వినైన్‌వల్ల దానికి గుండె బలహీనత ఏర్పడ్డది. ఇది ఇట్లా ఎందుకు జరగాలిసి వచ్చిందో! ఏదో బలమైన విధి తరుముకొచ్చి వాళ్ళచేత అల్లాగ చేయించింది... అని సత్యం తలవంచుకొని

ఆ పైన చెప్పలేను. ఆ తరువాత నేను ఎత్తుకొని జరిగిన విషయం ఇల్లాగ చెప్పాను.

* * * * *

......నేను తెనాలి వెళ్ళేటప్పటికే జ్వరం బాగా ఎక్కువైంది. నేను చూసేసరికి అది మంచంపైన పడుకొని ఉంది. దాని ముఖంపైన తెల్లటి గుడ్డ ఒకటి కప్పి, దానిని మంచు గడ్డతో తుడుస్తున్నాడు కాంపౌండర్. మా వాడు ఒక స్పాంజీని చల్లని మంచు నీళ్ళలో తడిపి దాని వళ్లు తుడుస్తున్నాడు. పాదాలు, చేతులు, ముఖం, పొట్ట ఈ భాగాలన్నీ తుడుస్తున్నాడు. ఈ స్థితిలో చూశాను అమ్మాయిని.

సత్యం నన్ను జూచి దిగాలపడ్డాడు. అందరూ నన్ను జూచి సానుభూతి కనపర్చారు. ఒక్క రాజమ్మగారు మటుకు నన్ను జూచి ముఖం ముడుచుకొంది. ఇంటిదగ్గర పిల్లలూ, ముసలమ్మా కులాసాగా ఉన్నారా అని అడగ లేదు. పిల్లకు జబ్బు చేసిందే అన్న విచారం ఆమె ముఖంలో ఎక్కడా వెతికినా కనపడలేదు.

ఆవిడ కాసేపు అట్లాగే నిలబడి ఉంది. ఆవిడను జూచి నేను కళ్ళనీళ్లు పెట్టుకొన్నాను. నన్ను జూచి జాలి పడటం లేకపోగా, పైగా ఆవిడ అన్నది "ఎందుకూ ఏడ్వటం. కాస్త జ్వరం వస్తే దానికేం? అది బాగానే ఉంటుంది. మంచంలో పడుకొని, రాణీలాగ ఉపచారం చేయించు కొంటున్నది. చేయలేక అవస్థపడే వాళ్ళు పడుతున్నారు. వాళ్ళ అవస్థచూడలేక నేను బాధ పడుతున్నాను."

ఈ ఎత్తిపొడుపు మాటలు ఆవిడ కఠినంగా అన్నది. "రాణీలాగ చేయించు కొందామని సరదాపడే జ్వరపడ్డదా రుక్కు? అన్నాను నేను" ఆ మాటలలో ఉండే పోటు తనం భరించలేక.

రాజమ్మగారు నా వంక కొరకొరా జూచి "ఏమో ఎవరికి తెలుస్తుంది?" అని ఒక విసుపు ముక్క అని వెళ్ళిపోయింది. రుక్కు దీనంగా, జాలిగా, నా వంక చూస్తూ ఉండి పోయింది. ఈ సత్యం బిక్కచూపులు చూశాడు.

ఒక్క క్షణం అయిన తరువాత, ఆవిడ అల్లుణ్ని పిలిచి "రాత్రి అంతా నిద్ర లేకుండా

నీకు. తండ్రి ఉన్నాడులే. నీవు వెళ్ళి కాస్త పడుకో. ఇల్లాగ అయితే నీవు కూడా మంచాన పడతావు" అన్నది.

సత్యం నా వంక చూశాడు. "వెళ్ళరా, పోనీ కాసేపు విశ్రాంతి తీసుకో. అమ్మాయి దగ్గర నేను ఉంటాను" అని నేను అన్నాను. వాడు ఆస్పాంజ్ నా చేతికి ఇచ్చి, అల్లాగే తుడుస్తూ ఉండమని చెప్పి, వెళ్ళిపోయి గదిలో పడుకొన్నాడు. ఆ తరువాత ఏవో గుసగుసలు వినిపించినై. అన్నగారు కోప్పడి ఉంటుంది.

ఇంతలో నా పక్కలోనున్న కాంపౌండర్ కూడా "ఇక నేను డిస్పెన్సరీకి వెళ్ళాలండీ. రోగులు ఎవరైనా వస్తే డాక్టరుగారు వస్తున్నారు కూర్చోండి, అని చెప్పాలె" అన్నాడు. నేను తల ఊపాను. ఆయన వెళ్ళి పోయినాడు.

అంతవరకు కళ్ళు మూసికొని ఉన్న అమ్మాయి అప్పుడు కళ్ళు తెరిచి, నేను ఒంటరిగా ఉండటం చూచి "నాన్నా అనిపిస్తే అల్లాగే మాట్లాడుతుంది. నీవు ఏమీ జబాబు చెప్పబోకు. కళ్ళు

మ్మానుకొని మనవని మనం గదుపుకు పోదాము"
అన్నది. నేను సరేనని తల ఊపాను. అది చెప్పిన
మాట నిజమే అనిపించింది.

అమ్మాయి అటూ ఇటూ చూచి, ఎవ్వరూ
లేరని తెలుసుకొని రహస్యంగా నాతో ఇట్లా
అన్నది ఎంతో దిగులు ముఖంపెట్టి. "రాజమ్మ
బామ్మ ఎటువంటి మనిషి అనుకున్నావు నాన్నా!
మొన్న పదహారు రోజుల పండగనాడు మామయ్య
ఇన్నిపూలు తెచ్చాడు నాన్నా; అక్కయ్య తల
నిండా పెట్టుకొన్నది. నాకు, నాలుగంటే నాలుగు
పూలు ఇచ్చి మిగిలినవి పక్క ఇంట్లో ఉన్న సుంక
రమ్మకు ఇచ్చింది! ఇంట్లో ఉన్న పిల్లను నాకు
ఇయ్యకూడదూ తీసికెళ్ళి పరాయి వాళ్ళ కియ్యక
పోతే!"

ఈ సంగతులు చెప్పి దీనంగా చూచింది.
పొదుగులో ఉన్న పాలన్నీ, కాపు తీసికొంటే,
వట్టి పొదుగును ముట్టెతో తాకి, పాలు లేవని
గ్రహించిన లేగదూడ తల్లివంక జాలిగా చూచి
నట్లు రుక్కు నా వంక చూచింది. నా గుండె

తరుక్కు పోయింది. దానికి పూలు లేక పోయి నయ్యా! కావలసినన్ని కొని పెట్టగలను. కాని ఆమె చూపిన నిర్దయ మాత్రం గుండెను పొడిచి నట్లు అయింది. "తల్లీ నీకు పూలకేమి తక్కు వమ్మా?" అని మాత్రం అని కళ్ళనీళ్ళు తుడుచు కొన్నాను. "అందుకు కాదు నాన్నా. ఆమె సంగతి చెప్పాను" అన్నది అమ్మాయి.

నేను కళ్ళ నీళ్లు పెట్టుకోటం చూచి రుక్కు తల్లి ఆ ప్రసంగం మానేసి ఇతర విషయాలు అడి గింది. "జీతం వచ్చిందా నాన్నా? ఇవ్వవలసిన వాళ్ళకు ఇచ్చావా? ఏమైనా తెచ్చావా?" అని అడిగింది. నేను అన్నిటికి సమాధానం చెప్పి "పది రూపాయలు తెచ్చానమ్మా" అన్నాను. "ఏదీ?" అని అమ్మాయి పది రూపాయల నోటు అడిగి తీసుకొని నోటు ఒకసారి అటూ ఇటూ తిప్పి చూచి "నాకిస్తావా ఇదీ!" అన్నది నవ్వుతూ. "తీసుకో తల్లీ" అన్నాను నేను. మెడలో నుంచి తాళంచెవి తీసి నాకిచ్చి "నా పెట్టెలో పెట్టు దాచుకొంటాను" అన్నది. సరేనని ఆ నోటు దాని పెట్టెలో పెట్టాను. అది మళ్ళీ తాళం

చెవి అడిగి పుచ్చుకొని తన పెట్టెలో కట్టు
కొన్నది.

మళ్ళీ అది అందరికి ఇయ్యవలసిన బాకీలు తీర్చానో లేదో వివరంగా అడిగి కనుక్కొన్నది. ముఖ్యంగా గొల్లదాని లెక్క దానికి తప్ప ఇంకొకరికి తెలియదు. అందుకని దానికి ఎంత ఇచ్చిందీ తెలుసుకొని, సరిగ్గా ఉన్నదని తృప్తి కలిగిన తరువాత కళ్ళు మూసుకొని పడుకొన్నది. అమ్మాయి ఎంత బాధ్యత వహించింది చిన్నతనంలోనే! కాపరానికి వెడితే కాపరం చక్కగా దిద్దుకు పోతుంది. అని నేను ఎంతో సంతోషించాను. కాని ఈ జ్వరం ఆ సంతోషాన్ని మింగింది...అని నేను తలవంచాను. ఆ తరువాత సత్యం అందుకొని చెప్పాడు.

* * * * *

......అదేమి జ్వరమో, దాని దుంప తెగ రావటం రావటం పెద్దపెట్టున వచ్చింది. అది టైఫాయిడ్ జ్వరమేననీ, మలేరియా జ్వరం కాదని

దాని తరువాత తెలిసింది. ఎందుకంటే అది క్వినైన్‌కు లొంగలేదు. ఇరవై యొక్క రోజూ జ్వరం నడవాలె అనుకొనేసరికే, గుండె జారి పోయింది. ఏమీ ఒడుదుడుకులు లేకుండా గడవాలె స్వామీ అని భగవంతుని ప్రార్థించాను.

మొదటివారం కాకముందే దానికి కడుపు నొప్పి వచ్చింది. ఇహ నాకేమీ తోచలేదు. అంతా రామారావుగారికి, ఉళక్కిగారికి వదిలేశాను. వాళ్ళద్దరు అది నిమోనియా అని తేల్చారు. ఈ జ్వరంలో నిమోనియా కూడా వచ్చేసరికి ఇహ నాకు మతి పోయింది. అయినా దాని దగ్గర ఉండి చేయగలిగిన సాయము అంతా చేశాను”......

సత్యం పిల్లలవంక చూస్తూ ఊరుకొన్నాడు. జంకజమ్మగారు కథ సాగించింది.

*     *     *     *     *

......సాయం అంటే సాయమూ అది పాపం. మీ మామయ్యకు పిచ్చి ఎత్తినట్లు అయిందిరా.

ఆసుపత్రికి వెళ్ళటం మానాడు. నిరంతరం పిల్ల దాని దగ్గరే ఉండేవాడు. దానికి మందు గంట గంటకు ఇవ్వటం, ఈగలవల్ల బాధ లేకుండా విసరటం ఈ పనులన్నీ తానే స్వయంగా చేసే వాడు. ఎవ్వరితోనూ మాట్లాడే వాడు కాదు. ఏదో దిగులుగా ఉండేవాడు. మధ్యాహ్నం భోజనం చేసిన తరువాత, మీ నాన్నను రుక్కుదగ్గర కూర్చోమని, తాను కాస్త నడుం వాల్చేవాడు. కాని తోచేది కాదు కామాలు పావు గంటలో మళ్ళీ వచ్చి రుక్కుదగ్గర కూర్చునే వాడు. దానిని వదలి ఒక్క క్షణం అయినా వాడు ఉండే వాడు కాదు.

ఆ తమాషా ఏమిటో కాని రుక్కుకూడా వాడినే నమ్ముకుంది. తనకు ఏమి కావలసినా మామయ్యా అని పిలిచేది. నాన్నా అని పిల వటం మానేసింది అదేమి చిత్రమో కాని!

ఎంత సేపటికీ, మామయ్యా, మామయ్యా మామయ్యా!! మామయ్యా కడుపు నొప్పి! మామయ్యా, ప్యాసు కెళ్ళాలి! మామయ్యా నాకు ఎప్పుడు నయము అవుతుంది? మామయ్యా

నీ హస్త వాసి మంచిది తొందరగా నయం జెయ్యి. ఇదీవరస. "అమ్మా నీ కేమీం ఫరవాలేదు. మంచి మందు ఇస్తున్నానే తల్లీ. తొందరగానే నయమౌతుంది" అనేవాడు మీ మామయ్య. తన దగ్గరే కూర్చున్న మామయ్య రెండు బుజాల పైన తన రెండు చేతులూవేసి, వాడి ముఖాన్ని తన బుగ్గలకు ఆనించుకొని, మామయ్యా మామయ్యా అని కళ్ళ నీళ్ళు పెట్టుకొన్న దమ్మా రుక్కుతల్లి. దాని కడుపులో ఎంత ప్రేమ ఉందో మామయ్యమీద!

రెండో వారంలో రుక్కుకు బాగా ఎక్కువైంది. అప్పుడే కదమ్మా నీవూ పిల్లలూ, మళ్ళీ తెనాలి వచ్చారూ?... అని పంకజమ్మగారు మా పిన్నివంక చూచింది, తరువాత సంగతి చెప్ప మన్నట్లు. మా పిన్ని చెప్పింది.

*   *   *   *   *

......మీ నాన్న టెలిగ్రాంమీద వెళ్ళిపోయిన తరువాత నాకేమీ తోచలేదమ్మా. ఏమిటో ఆ మోహమయం. రుక్కు ఎట్లాగుందో అనే ఆలో

చనే ఎప్పుడూనూ!! వారం రోజులు ఎట్లాగో గడచినై. ఇంతలో ఉత్తరం రానే వచ్చింది రుక్కుకు నిమోనియా కూడా వచ్చిందని. ఇహ కాళ్ళు నిలవలేదు. నేను పిల్లలను తీసుకొని వెంటనే బయలుదేరి తెనాలి వెళ్ళాను. అయితే సత్యం ఇంట్లో ఉండక వేరే వాళ్ళ ఇంటికి దగ్గరలోనే మరో ఇల్లు అద్దెకు పుచ్చుకొని అక్కడ ఉన్నాను. "మీరు వేరే ఉండటం ఎందుకమ్మా" అని సత్యం అన్నాడు కాని నేను ఈ సమాధానం చెప్పాను. "నాయినా, రుక్కుకు అసలం జ్వరంగా ఉంది. మేము కూడా అక్కడ ఉండటం మంచిది కాదు. పసిబాలిక, ఈ పిల్లలు అల్లరి చేస్తారు. కేకవేస్తారు. దాని నిశ్శాంతికి భంగం. దూరంగా ఉంటాము. ఎందుకైనా మంచిది" అన్నాను. మీ మామయ్య సరేనని ఊరుకొన్నాడు.

అయితే అప్పుడప్పుడు మీరంతా తల్లి, మీ రుక్కు అక్కయ్యను చూచి వస్తుండే వాళ్లు. దాని మూలానో, మరి దేనివల్లనో సుశీకి కూడా జ్వరం వచ్చింది. ఇహ అప్పటినుంచి నేను సుశీ

దగ్గరే ఉండి పోయివాను. ఈ సంగతి రుక్కుకు తెలిసింది అనుకుంటా! ఏంరా! అని ఆవిడ నా వంక చూచింది. నేను చెప్పాను ఇల్లాగ.

......తెలియక ఏమమ్మా! తెలిసింది. అది రోజూ అడుగుతుండేది సుశీ ఎట్లాగుంది నాన్నా అని. దానికి కులాసా ఇచ్చిందే అమ్మాయీ అని నేను అనేవాణ్ని.

ప్రొద్దున్నే టెంపరేచరు చూచే సమయాన రుక్కు కాస్త తెలివిగా ఉండేది. నోట్లో నుంచి థర్మామీటరు తీయటంతోనే "ఎంత ఉంది నాన్నా" అని అడిగేది. నూట మూడు ఉండేది. అంత ఉందీ అంటే భయపడుతుందని "నూరు ఉందే అమ్మాయీ. జ్వరం తగ్గి పోతున్నదే" అని అబద్ధం చెప్పేవాణ్ని. వెధవ బ్రతుకు ఎన్నిసార్లు అబద్ధం ఆడానో పిల్లతో. అది పాపం నా మాటలు నమ్మి సంతోషించి, భగవంతునికి నమస్కారం పెట్టి "ఓయి భగవంతుడా, సుశీకి కూడా జ్వరం తగ్గించు" అని, ప్రార్థించేది. తనకు తగ్గి పోతున్నదే అనుకొన్నది తల్లి!! తల్లిని

నేనెంత భ్రమలో పెట్టానా అని ఇప్పుడు దుఃఖం వస్తుంది.

పొర్లిస్తున్న అమ్మాయికి ముఖం కడిగించి బట్టలు మార్చి, వళ్లంతా వేడి నీళ్లలో తడిపిన గుడ్డతో తుడిచే వాళ్ళం. ఆ తరువాత టెంప రేచరు చూచే వాళ్ళం. ఇంతలో రామారావు గారూ ఉళక్కగారూ వచ్చి పిల్లను కదిలించకుండా పక్క బట్టలు మార్చేవారు. గది అంతా శుభ్రంగానే ఉండేది. చీమలు రాకుండా మంచపు కోళ్ళు, పళ్లేలలో పెట్టి అందులో నీళ్ళు పోసే వాళ్ళం. హారతి కర్పూరంపొడి గదినిండా చల్లి, గుగ్గిలం, సాంబ్రాణీ, పొగ కూడా వేసేవాళ్లం. ఇన్ని విధాల జాగ్రత్త పడ్డాం.

కాని ఒక్కలోపం జరిగింది. నేను వెళ్లిన మర్నాడే చూశాను. రుక్కు ఊరికే తల బరు క్కుంటూ ఉండేది. ఎంతసేపటికీ తలలో నుంచి చెయ్యితీయదు. దాని అవస్థచూచి ఏమిటీ సంగ తని నేను వెళ్లి చూశాను. దాని తలనిండా పేలు లుకలుక లాడు తున్నై. మా మామయ్యకు

చూశాను. వాడు చూశాడు. డాక్టర్లు చూశారు. నిర్ఘాంత పోయినారు.

దానికి రోజూ ఒకసారి తల దువ్వాలిసింది. ఆ పని ఎవ్వరూ చెయ్యలేదు. డాక్టర్లు ఇదివరలో చెప్పారట, రాజమ్మగారితో దానికి తల దువ్వుతూ ఉండండీ అని. ఆడవాళ్లు చెయ్యాలిసిన పని కాబట్టి, పెద్దదికదా అని ఆమెతో చెప్పారు. మాకు తెలియదు.

మీ అమ్మ ఉంటే చూచుకొనేది ఇట్లాంటి విషయాలు. తల్లి లేకపోబట్టే రుక్కుకు ఆ స్థితి సంభవించింది. ఈ మాటే అక్కడ ఉన్న వాళ్ళంతా అన్నారు. తల్లిలేని లోపం జీవితంలో అడుగడుగునకూ కనపడుతునే ఉంది అని. ఇంట్లో ఉంటానికి ఇద్దరు ఆడవాళ్లున్నారు. మీ అక్కయ్యాను రాజమ్మగారూ. మీ అత్తయ్యకు తెలియక పోతే, పెద్దది ఆవిడకు తెలియక పోయిందా ఈ మాత్రం సాయం చెయ్యాలని! ఇంతకూ

ఆవిడకు తల్లిలేని పిల్ల అని అయినా రుక్కుమీద కనికరం లేకపోయింది......అని నేను అంటే మా పిన్ని అందుకొని ఇల్లా అన్నది.

* * * * *

ఓసీ, నీ వింత పిచ్చిన బడతావేంరా? ఆమెగారు నీ పిల్లకు తల దువ్వుతుంది? ఆవిడ ఎందుకు దువ్వుతుంది? అసలు ఆ ఆలోచన ఎందు కొస్తుంది ఆవిడకు? జబ్బు పిల్లకు తన అల్లుడు చాకిరి చేస్తున్నాడే అని అసలు ఆవిడ గోలపడుతూ ఉంటే, పైగా నీ పిల్లకు జుట్టు దువ్వలేదనా నీగోల! బాగుంది! ... ఆ మాటమీద పంకజమ్మగారు అన్నది.

* * * * *

ఏమిటోలే, తండ్రి ప్రాణం కాబట్టి అల్లాగ గిలగిల కొట్టు కొంటుంది. కాని ఇంతకూ దాని తల్లి ఉంటే ఇల్లాంటి లోపాలు జరిగేవి కావు. ఆ రాజమ్మగారికి తోచక పోయింది. లేకపోతే ఆమె దాని దగ్గరకు రావటానికి ఇష్టం లేదు. రాలేదు

అనుకొందాం! పోనీ మనకు తోచకూడదూ! మనం దాని దగ్గరకు రోజూ పోతున్నాముగా! అదీ ఒక ఖర్మమే!... అని నిట్టూర్పు విడిచింది.
"అప్పుడేమైంది నాన్నా అక్కయ్య తలలో పేలు పడితే ఏం జేశారూ?" అని సుశీ అడిగింది.
మళ్ళీ నేను చెప్పాను ఇల్లాగ.

* * * * *

ఆ పేలు తలలోనుంచి పాకి పరుపుపైన యథేచ్ఛగా తిరుగుతూ, జ్వర పీడనవల్ల పోగా మిగిలిపోయిన రక్తాన్ని తాగుతున్నాయి.

పిల్ల పేలవల్ల బాధ పడుతున్నది. తల అట్లాగే వుంచితే ఎట్లాగండీ అని నేను అంటే ఆ డాక్టర్లలో ఒకాయన కత్తెర ఒకటి బయటకు తీసి అమ్మాయి వెంట్రుకలన్నీ, కుచ్చులు కుచ్చులుగా పట్టుకొని కత్తిరించాడు. పట్టు కుచ్చుల లాగ ఉన్న అమ్మాయి వేణీ బిరుసెక్కి జడలు గట్టి గనాచారికి ఉన్నట్లుగా ఉంది. ఈ కత్తిరించటం అమ్మాయికి తెలియదు. అది అప్పుడు మత్తులో ఉంది. ఆ తరువాత ఆ కారచ కురులను నేను పుస్తకంలో

దువ్వి ఆ ఉన్న పేలను చాలా వరకు చంపేశాను. మత్తుపోయిన తరువాత అమ్మాయి చేత్తో తల తడిమి చూచుకొని బిక్క ముఖం పెట్టి "మామయ్యా, నా జుట్టు అంతా ఏమైంది?" అని అడిగింది. పేలు పడితే కత్తిరించాము అమ్మా అన్నాను. ఆ మాట విని దిగులు ముఖంతో ఏదో పెద్ద విలువైన వస్తువును పోగొట్టుకొన్న దానివలె చూస్తూ అడిగింది రుక్కు "మామయ్యా జుట్టు అంతా కత్తిరించావే! నేను పూలు ఎల్లా పెట్టుకొనేది?" తల్లి ఎంత అమాయికంగా అడిగింది!! గుండె దడదడ లాడింది. కడుపులో చల్ల చేసినట్టు అయింది. అమ్మాయి మళ్లీ అన్నది "ఇక నేను పూలు పెట్టుకొనవద్దా?"

తల్లీ జుట్టు మళ్ళీ నిమిషంలోకి వస్తుంది. ఎందుకమ్మా అంత దిగులు పడతావు? అని అన్నాను నేను. పది మంది కలిసి ఒక్క నిస్సహాయకు గొప్ప అన్యాయం చేస్తే, ఆమె పవిత్రంగా

నేఁవవసమై ఉంటుందో, అల్లాగే ఆ అమ్మాయీ నలుగురి వంకా, దిగులుతో జాలిగా నాకింత అన్యాయం చేస్తారా అన్నట్లు చూచింది.

ఒక్క పువ్వు అయినా మిగల్చకుండా, అన్నిపూలు కోసుకొంటే, అందమైన పూలు పోగొట్టుకొని మల్లికాలత బోసిపోయి, ఎంత బెగారపడి చూస్తుందో, తాగుదామని ముందుపెట్టుకొన్న పాలను మాత్రంగా పిల్లివచ్చి తాగేస్తే పిల్లవాడు ఎంత దిగాలపడి చూస్తాడో అంత దగాలపడి చూచింది రక్కతల్లి మావంక.

అమ్మాయి దొడ్లో చేమంతి మొక్కను ఒక దానిని నాటి దికొన్న నెలలకిగింద. హేమంతంలో పుయ్యాలిసిన చేమంతి సౌందర్యపడి, పుష్పించే శక్తి అంతా వినియోగించి, శరత్తులోనే పుష్పించింగి. "ఏమంత తొందర? పుట్టి మునిగి పోయినట్లు అప్పుడే రెక్కలు విప్పుకున్నావు! రక్కతల్లి బ్రతికి బట్టగడితే పూలకే రక్కవా?" అంటూ కిన్నెర జేసింది దగ్గరలో ఉన్న మందార. చేమంతి, కింది చూపులు చూస్తూ మ్లాన

ముఖంతో. "అమ్మో రుక్కుతల్లి ఇంకేం పూలు పెట్టుకొంటుంది?" అంటూ హిమాశ్రువు నొక దానిని జారవిడిచింది......అని అంటూ నేనూ కళ్ల నీళ్లు పెట్టుకున్నాను. వెంటనే మా పిన్ని అందుకుంది.

*    *    *    *    *

......మూడో వారంలోనే రుక్కు చాలా భయపడ్డదరా! నేను మొదట్లో దాని దగ్గరకు రాలేదు. ఎందుకంటే సుశీ దగ్గరే ఉండి దాని సంగతి చూచేదాన్ని. సుశీకి పది రోజులకే జ్వరం తగ్గిపోయిందిగా! అప్పటినుండి రుక్కు దగ్గరే ఉంటూ వచ్చాను. ఒక రోజున దాని మొగుడు వచ్చాడు. వాడ్ని చూచేసరికి రుక్కు ముఖం ఇంతైంది. కార్యం కాలేదు. మొగుడితో కాపురం చెయ్య లేదన్నమాటే కాని దానికి మొగుడిపైన ఎంతో ప్రేమ. వాడువచ్చి దిగాలపడి నుంచున్నాడు. రుక్కు వాడ్ని తన పక్కలో కూర్చోమని పిలిచిందిరా. వాడు కూర్చున్న తరువాత ఊహలు చూచిందిరా వాడ్ని

ఇంతింత కన్నీళ్ళు. వాడు ఏమైనా మాట్లాడు కొంటాడు. నేను ఉంటే సిగ్గు పడతారని వాళ్ళను వదిలి నేను కాస్త బయటికి వెళ్ళాను పనిమీద వెళ్ళి నట్లు. అప్పుడు మీ నాన్న, మామయ్యా కూడా అక్కడ లేరు. పాపం వాళ్ళేదో మాట్లాడు కొన్నారు. చివరకు వాడు వెళుతూ ఉంటే రుక్కు వాడిని దీనంగా చూస్తూ నమస్కారం చేసి "బావా, మళ్ళీ నాలుగు రోజుల్లో రా, స్కూలుకు సెలవులిస్తే. నాకు ఏమీ ఫరవాలేదు. జ్వరం తగ్గుతుంది. నీ వేమీ దిగులు పడబోకు" అని చెప్పింది.

అంత జ్వరంలోనూ కూడా అది ఎంతో నెమ్మ దిగా ఉండేది. ఎప్పుడైనా పిల్లలు దాన్ని చూడటానికి వస్తే వాళ్ళను, పేరు పేరునా పలకరించేది. రాధా యను చూచి నవ్వి "నాయినా అప్పుడే తిరుగు తున్నావా? నా తండ్రి! ఎంత జబ్బుపడి బ్రతి కావురా!" అని వాడిని దగ్గరకు పిలిచి ముద్దు పెట్టుకొని పంపేది. శాస్త్రిని పిలిచి "అన్నం తిన్నావు గా నాయినా? ఏమి వేసుకు తిన్నావురా?" అని ఎన్నో ప్రశ్నలు అడిగి, వాడి ముద్దు మాటలు విని

సంతోషించేది. పసిదాన్ని విజయను ఒక్కసారి ముద్దు పెట్టుకొని ఆపుకోపో అమ్మా అని పంపేది!

ఎంతో నీరసించి పోయింది ఆహారం లేక. మధ్యాహ్నం పన్నెండు గంటలకు కాస్త బత్తాయి రసమో బార్లీ నీళ్లో తాగించేదాన్ని. దానికి ఇచ్చే ఆహారం అంతే. బిడ్డ ఏమో చెప్పలేని బాధ పడ్డది. నేను విసిరే దాన్ని. మంచుగడ్డ ముక్కలతో తుడిచేదాన్ని. మిగిలిన పనులన్నీ వాళ్ల మామయ్య చూచుకొనే వాడు.

ఒక రోజున ఏమైంది అనుకొన్నారు. నేను ఒక్క దాన్నే కనిపెట్టుకు కూర్చొని మంచు గడ్డతో దాని వళ్లు తుడుస్తున్నాను. అప్పుడు అది తెలివి గానే ఉంది. "ఎంత సేపని తుడుస్తావు బామ్మా? పోద్దస్తమానం ఇల్లాగ మంచుగడ్డ నా నెత్తిన. పెడితే జ్వరం తగ్గుతుందా? ఎందుకొచ్చిన అవస్థ ఊరుకో బా అమ్మా, లాభం లేదు" అన్నది నీరసించిన గొంతుకతో. నాకు వళ్లు ఝల్లు మన్నది. ఏమిరా బిడ్డ ఇల్లాగ అంటుందే అనుకొని

పైకి మటుకు "తల్లీ అల్లాగ అనుకోకు. తప్పక జ్వరం నయమవుతుంది. కాస్త బాధ పడాలి. తప్పదు. ఏం జేస్తాము" అన్నాను నేను గద్గద స్వరంతో. "మూడో వారం తగ్గవద్దు బాపమ్మా! పైగా నాకు నిమోనియా కూడా వచ్చిందాయె! ఇది నయమవుతుందా బాపమ్మా?" అన్నది వణుకుతున్న గొంతుకతో.

అది అసలు గుండె నిబ్బరంగల పిల్ల. అటువంటిది అల్లాగ మాట్లాడుతూ ఉండే!! పైగా దాని స్వరము బాగా హీన పడ్డది. నాకు దుఃఖం ఆగలేదు. నేనే ఏడిస్తే అది మరీ అధైర్య పడుతుందని శివుడు హాలాహలాన్ని మింగినట్లు, దుఃఖాన్ని మింగి ఊరుకొన్నాను.

అమ్మా తప్పక నయమవుతుంది. నేను జ్యోతిష్కుడిని కూడా అడిగాను. ఇది రాహువు దశట! ఇంకా పదిరోజులు ఉందట! ఆ పది రోజులు గడిచిన తరువాత, నీకు ఆరోగ్యం కుదిరి హాయిగా ఉంటావు. ఏమి భయం లేదు నీకు అని ధైర్యం చెప్పాను.

రుక్కుకు నా మాటలయందు విశ్వాసం కలిగింది. తృప్తి పడ్డట్టు చూచింది. నేను ముఖం మీదకు వంగి బిడ్డను మనసార ముద్దెట్టుకొన్నాను. రుక్కు నన్ను కౌగలించుకొని ఏకుల్లాగ ఉన్న తన రెండు చేతులనూ నా మెడకు చుట్టేసి "ఎప్పుడు నయమౌతుంది బొమ్మా! ఎప్పుడు ఇంత చారూ అన్నం తింటాను బొమ్మా?" అని అడిగింది. అమ్మకు చారూ అన్నం పెట్టే భాగ్యము నాకు ఉందా అని భయంవేసింది. గుండెల్లో దడ పుట్టింది. అమ్మకు ఇంత చారూ అన్నం పెట్టలేక పోతానా? వాళ్ల మామయ్య మంచి మందు ఇస్తున్నాడు. వాడిది అమృత హస్తం! అనుకొని నీకేం భయం లేదు తల్లీ. కాకపోతే నాలుగు రోజులు బాధ పడతావు, అంతే. అని మళ్ళీ ధైర్యం చెప్పాను. చెప్పాను కాని నాకు ధైర్యం చాలలేదు. ఆ పళంగా దొడ్లోకి వెళ్లి కాసేపు హృదయ భారం తీర్చుకొన్నాను దుఃఖపడి. అయినా దాన్ని మహా బాధ పెట్టారు డాక్టర్లు గంటకో ఇన్‌జెక్షను ఇచ్చి! — అని ఆవిడ కళ్ల నీళ్లు పెట్టుకొన్నది. నేను ఇల్లాగ చెప్పాను.

* * * * *

......మరీ బాగుంది! వాళ్లు మటుకు దాన్ని బాధపెట్టాలని పెట్టారా? తొందరగా జబ్బు నయం కావాలనే ఇన్‌జక్షన్ ఇచ్చారు. కాని చూశావుగా, మూడోవారంలో అయిదారు రోజులు గడిచిన తరువాత అది సరిగా మాట్లాడ లేదు. ఆ రోజున నీవు నన్ను కూర్చోపెట్టి బైట కెళ్లావో, అప్పుడే నేను కనిపెట్టాను అది ఏమి తెలివిగా లేదు. నేను దగ్గరే ఉన్నా నన్ను గుర్తించక "అమ్మా, అమ్మా ఎందుకే ఏడుస్తావూ?" అంటూ, అక్కడ ఎవరో ఉన్నట్లు కౌగలించుకోబోయింది లేచి. నేను పట్టుకొని పడుకోబెట్టి ఏమిటే అమ్మా అంటే, "అమ్మ వచ్చింది నాన్నా! ఇక్కడే కూర్చుందిగా అమ్మ ఇందాకటినుంచీ" అన్నది. దాన్ని మాట్లాడిస్తే ఆయాసం వస్తుందని, సరేలే కళ్లు మూసుకొని పడుకోమని దానితో అన్నాను.

ఇంతలో డాక్టర్లు వచ్చి, దానిని పరీక్షచేసి, మరో ఇన్‌జక్షన్ ఇచ్చారు. వాళ్లు వెళ్లుతూ ఉంటే నేను అభివందనం చేశాను. వాళ్లు నా వీపుపైన తట్టి "భయపడకు నెమ్మదిగా ఉండు" అని చెప్పి వెళ్లిపోయినారు. నాన్నతో మాట్లాడుతూ నర్సింగుహోంకూడా వెళ్లాము.

ఇంతలో అక్కడికి సత్యం భార్య వచ్చింది. వచ్చి అమ్మాయికి రెండు మూడు గజాల దూరంలో గుమ్మంలో నుంచుని పిల్లను చూచి వెళ్ళి పోయింది. రుక్కు నా వంక చూచి "చూచావా నాన్నా! అత్తయ్య ఒక్కసారి అయినా నా దగ్గరకు రాదు! ఈ గదిలోకి కాలు పెట్టదు. ఎప్పుడైనా వచ్చినా, అంత దూరాన గుమ్మంలో నుంచుని చూచి పోతుంది. ఒక్క మాట అయినా మాట్లాడదు" అన్నది జాలిగా.

పోనీలే అమ్మా ఆవిడ రాకపోతే నీకేం తక్కువతల్లి. నేను ఉన్నాను. మామయ్య ఉన్నాడు. మా అమ్మ ఉంది. ఆవిడ రాకపోతే నీకు జరగంది ఏముంది? అన్నాను.

"బామ్మ సరేసరి. చూస్తున్నావుగా! కొరకొర లాడుతుంది. నన్ను జూస్తే అంతకోపం ఎందుకూ ఆవిడకూ? నే నేం పాపం జేశానూ?" అన్నది రుక్కు.

నువ్వేమి పాపం చేయలేదే తల్లీ. ఆవిడ స్వభావమే అల్లాంటిది. నీకు తెలుసుగా అమ్మా

అన్నాను. ఆమ్మాయి తల ఊపింది. "మామయ్యా ఏడీ నాన్నా" అన్నది. 'డాక్టర్లతో వెళ్లాడమ్మా. వాళ్లను పంపించి వస్తాడు' అన్నాను.

ఇంతలోకే వాడూ వచ్చాడు. వాడు వచ్చే సరికి మళ్లీ దానికి తెలివి పోయింది. అది ఏదో గొణకటం మొదలు పెట్టింది. నేను దాని మీదికి వంగి "ఏమిటి తల్లీ అంటావు?" అన్నాను. ఆ ప్రశ్నకు జబాబు చెప్పక అది "ఇతర దైవ ముల" అనే కీర్తన పాడింది. ఈ జ్వరం ఏమిటి! ఈ పాట ఏమిటి! ఏమిటే తల్లీ! పాడతా వేమిటే అమ్మా అంటే అది వినిపించుకో లేదు. మన స్పృహలో లేదు.

నేను గుడ్లనీళ్లు త్రిప్పి సత్యంవంక చూశాను. వాడు దాని దగ్గరకు వచ్చి, అమ్మాయిపైకి వంగి ఏమిటే రుక్మా? అని అడిగాడు అది వాణ్ని జాలి కళ్లతో చూచీ "అమ్మా, ఇంత సేపు అయిందే నీవు వచ్చి! రా! నా పక్కన కూర్చో. ఎందుకే అమ్మా విచారంగా ఉన్నావు?" అని అనటం సాగించింది.

అప్పుడు సత్యం దాసిమీద చెయ్యివేసి, "అమ్మాయీ రుక్కూ నేనమ్మా మామయ్యను అన్నాడు. రుక్కు, బలవంతం మీద కళ్లు తెరిచి చూచి "మామయ్య వేనా! రా మామయ్యా. మా మామయ్య ఎంతో మంచి వాడు! మామయ్యా నా దుఃఖాన్ని దాచుకోంటానికి చోటు కనపడ కుండా ఉందిమామయ్యా! ఇల్లారా" అని వాడిని తన వక్షానికి అదుముకొని పెద్దగా ఏడ్చింది. అంత పెద్దగా అమ్మాయి ఎప్పుడూ ఏడ్వలేదు. ఇంత జ్వరంలోనూ! "నీవు మంచి వాడవు మామయ్యా నీ అంత మంచి మామయ్య దొరకటం నాఅదృష్టం! నాకు జ్వరం పోయింది మామయ్యా! ఎంత హాయిగా ఉన్నానో చూడూ. మామయ్యా, ఇందాక అమ్మతో చెప్పాను నీవు మంచి మందు ఇచ్చి నయం జేశావని. అమ్మ సంతోషించింది. మామయ్య మాట ఎప్పుడూ విను అమ్మా. మామయ్య మనస్సుకు ఎప్పుడూ కష్టం కలిగించకు. మామయ్యకు సౌఖ్యం కలిగేపని చెయ్యి, అన్నది. నేను ఏమన్నా నీకు కష్టం కలిగించానా ఎప్పుడైనా? అల్లాగయితే క్షమించు మామయ్యా" అని దణ్ణం పెట్టింది నీరసంగా చూస్తూ.

ఆ రోజున హఠాత్తుగా వాన వచ్చింది. చలిగాలి కూడా వస్తున్నది. అందుకని నేను లేచి కిటికీ తలుపులు వేయబోయాను. రుక్కు మళ్ళీ అన్నది. "మామయ్యా ఆ తలుపులు వేయవద్దను. ఆ తలుపులు వేస్తే అమ్మ ఎట్లా వస్తుందీ? మామయ్యా. మా అమ్మ నీకూ అమ్మే కదు మామయ్యా?" అన్నది.

సత్యం ఇంతవరకూ ఎట్లాగో బిగబట్టగలిగాడు తన దుఃఖాన్ని. "మా అమ్మ నీకూ అమ్మే కదూ?" అన్నమాట విని ఒక్కపెట్టున ఏడ్చాడు. నాయినా సత్యం ఏమిటీ ఈ మాటలూ అన్నాను నేను. "ఏముంది! సంధి పుట్టింది" అని వాడు వెక్కి వెక్కి ఏడ్చాడు—ఆ రోజునుంచీ పిల్ల మన లోకంలో లేదు. స్పృహాలేదు. ఏవో పిచ్చి పాటలు పాడటం మొదలు పెట్టింది. ఒకప్పుడు దాని గొడవలో అది ఉండేది. మరొక్కప్పుడు చక్కగా తెలివిగా ఉండి, మన ప్రశ్నలకు సరి

మైన సమాధానం చెప్పేది. ఆరోజునుంచీ అయోమయం.........

నేను చెప్పటం ఆపేశాను. పిల్లలు బిత్తర పోయి వింటున్నారే గాని, ప్రశ్నలు అడగటం మానేశారు. సుశీ మటుకు ఒక్క ప్రశ్న అడిగింది. అక్కయ్యకు జబ్బు ఎక్కువైన తరువాత బావ మళ్ళీ రాలేదా అని. దానికి జవాబు నేనే చెప్పాను. "అప్పుడు సరిగ్గా సెప్టెంబరు పరీక్ష రోజులు. రుక్కుకు జబ్బుగా ఉందని వ్రాస్తే, పరీక్షలు పాడై పోతవని మొదట్లో నేనే వ్రాయలేదు. కాని దానికి సంధి పుట్టిన తరువాత వ్రాశాను. కాని అతడు అప్పటికే తండ్రికి జబ్బుగా ఉంటే స్వగ్రామం వెళ్లాడు. నా ఉత్తరం అతడు చూడలేదు" ఆ తరువాత నేను ఊరుకొన్నాను. వెంటనే పంకజమ్మగారు ఇల్లా అన్నది.

*　*　*　*　*

......ఆ సంధి ప్రారంభమైన రోజునుంచీ ప్రొద్దున పదకొండు గంటలకు, పోష్టుమన్ వచ్చే వేళకు అది తెలివి తెచ్చుకొని "మామయ్యా నా కేమైనా

ఉత్తరం వచ్చిందా?" అని అడుగుతుండేది. లేదమ్మా అనేవాళ్లం. అది చిన్న బుచ్చుకొని మళ్లీ మత్తుగా పడుకొనేది. ఆ ఉత్తరం ఏమిటో ఎవరికీ అర్థం కాలేదు. రోజూ అదే పతనం. ఎవరి దగ్గరనుంచి నీకు ఉత్తరం రావాలమ్మా? నీవు ఎవరివద్దనుంచి ఉత్తరం వస్తుందని నిరీక్షిస్తున్నావు? అంటే మాట్లాడదు. ఉత్తరం రాలేదు అన్నప్పుడు మాత్రం పరివేదన పొందిన ముఖం ఇంత చేసుకొని పడుకొనేది. మధ్య మధ్య "ఉత్తరం వస్తుంది. రేపు అయినా తప్పక వస్తుంది." అంటూ ఉండేది. మర్నాడు మళ్ళీ ఉత్తరం రాలేదు అనేవాళ్లం.

ఎడారిలో నీటి కోసం తిరిగి తిరిగి నీరు దొరకక ఇహ ప్రాణాలు నిలవ్వు అని తెలుసుకొన్న, బాటసారి దిగులుపడి చూచినట్లు చూచింది తల్లి.

దాని బాధ చూడలేక పోయినా నమ్మా. అందుకని నేనే మీ నాన్నతో అన్నాను. అబ్బాయీ అది ఉత్తరం అంటున్నది. పోస్టు

మళ్లీ ఏమనుకొందో ఏమో, దిండు కింది నుంచి ఆ ఉత్తరం తీసి చదువుకొన్నది. ఆ ఉత్తరంలో జయ ఏవో సంగతులు వ్రాసింది వాళ్ల చదువులను గురించి. చివర ఏమని వ్రాసిందంటే "నీవు స్కూలు మానివేసి రెండు నెలలైనది. ఈ సంవత్సరానికి నీవు చదువు మానాలిసిందే. రోజులు అయిపోయినై"—

ఉత్తరం చదవటం పూర్తి చేసి, అది వాళ్ళ నాన్నను పిలిచి "ఉత్తరం వచ్చింది నాన్నా రోజులు అయిపోయినైట!" అని ఊరుకొంది. మీ నాన్న నిశ్చేష్టుడై పోయినాడు. నోట మాట రాలేదు. కాసేపటికి తెప్పరిల్లి, ఆయన రుక్కుపై వంగి ముద్దెట్టుకొని ఏమిటి తల్లి ఆ మాటలూ! పడుకో అమ్మా అన్నాడు. రుక్కు జాలిగా చూచి "ఇంహ పడుకుంటా నాన్నా" అన్నది...... ఆవిడ చెప్పలేక పోతే నేను చెప్తాను ఆ పైసంగతులు?

* * * * *

......ఆ రోజునుంచీ పిల్ల మన లోకంలో లేదు. ఏవో పిచ్చి పాటలు పాడటం మొదలు పెట్టింది.

అమ్మాయికి కష్టపడి ఆ రేండ్లు సంగీత విద్య చెప్పించాను. ఎన్నో కృతులు వచ్చు. దాని నోటికి వచ్చిన కృతి అల్లా పాడేది. ఎవరేమన్నా విని పించుకోదు. మన వంక చూడదు. ఏదో వింత లోకాల్లోకి చూస్తున్నట్లుండేది.

ఈ సత్యం దాని పక్కను వదలలేదు. రాత్రింబవళ్లు దాని దగ్గరే ఉండేవాడు. నిద్రాహారాలు మానాడు. నేనైనా తినే వాడ్ని కాని వాడు బొత్తిగా ఎంగిలి పడటం మానేశాడు. ఇదేమిట్రా నాయినా అంటే కసరుకొనేవాడు. వాడి అత్తగారు మటుకు ఇదంతా చూచి చాలా కష్టపడ్డది. వాడికి జబ్బు చేస్తుందని ఆమె భయము. ఆవిడ అనేక విధాల చెప్పి చూచింది. కాస్త విశ్రాంతి పుచ్చుకో. రాత్రిళ్లు కాస్త నిద్రపో. దాన్ని కనిపెట్టి చూసేందుకు మనుష్యులు లేరు గనకనా? ఎవరో ఒకరు ఉంటారు. లేకపోతే మటుకు ప్రాణం మీదికి తెచ్చుకొంటావా ఏమిటి? అంటూ ఏమేమో చెప్పింది. వాడు వినలేదు. "ఎంత మంది ఉంటే ఏమమ్మా నేనుండక పోతే! అది ఎప్పుడు పిలుస్తుందో! సమ

యానికి నేను ఉండొద్దూ" అంటూ ఏమేమో అన్నాడు.

రాత్రిళ్లు దాని మంచంపైన ఒక ప్రక్కన తల ఆనించి కాస్త కునికేవాడు. నేను మేలుకొని ఉండే వాడిని. వాడు మేలుకొని కూర్చున్నప్పుడు నేను మరో ప్రక్కన అల్లాగే మంచంపైన తల ఆనించే వాడ్ని. దానికి ఎప్పుడో మెలకువ వచ్చి మామయ్యా? అనేది. వాడు అమ్మా అనేవాడు. అంతే. మళ్ళీ కళ్లు మూసుకొని పడుకొనేది.

ఈ స్థితి రాజమ్మ గారికి మనః క్లేశము కలిగించింది. ఆమె ఎంత చెప్పినా వీడు వినక దాని మంచం అంటి పెట్టుకొని ఉండేవాడు. దాని మంచానికి అతుక్కు పోయినాడు.

ఈ స్థితిజూచి రాజమ్మ హడిలి పోయింది. కూతురు మంగళ సూత్రాన్ని పట్టుకొని కళ్లను అద్దుకొన్నది. అప్పుడే రుక్మను చూడటానికి వచ్చిన సుందరమ్మతో అన్నది. "అల్లుడు మంచానికి అంటుకు పోయినాడు. అమ్మాయి

అదృష్టం ఎల్లాగు ఉన్నదో! ఒక్కగాని ఒక్కపిల్ల! ఏరి కోరి తెచ్చుకొన్నామమ్మా ఈ సంబంధం! ఏదో మొగుడూ పెండ్లామూ చిలకా గోరింకల లాగ ఉంటారనుకొన్నాను. వాళ్ల అక్కయ్య ఉన్నన్నాళ్లూ అదో గోల! ఆ దరిద్రం వదిలితే మరో దరిద్రం చుట్టుకొన్నది! ఈ దరిద్రం ఎప్పుడు వదులుతుందో! నా పిల్ల ఎప్పుడు సుఖ పడుతుందో! నిద్రాహారాలు లేకుండా చేస్తు న్నాడు ఆ పిల్లకు. లోకంలో ఎంత మందికి లేరమ్మా మేనకోడళ్లు! అవ్వ! అందరూ ఇల్లాగే చేస్తున్నారా మేన కోడళ్ళకు. ఇది ఇట్లాగే ఇంకో పదిరోజులు మంచంలో ఉన్నదా ఈయన ప్రాణాలు దక్కవు. ఓయి భగవంతుడా ఈ పీడ వదిల్చి నా కూతురి కాపురం నిలబెట్టు తండ్రీ అని దైవాన్ని ప్రార్థిస్తున్నాను".

పక్క గదిలో పిల్ల మంచం పక్కన కూర్చుని, నేను ఈ మాటలన్నీ విన్నాను. వళ్లు మండి పోయింది. ఇంత జబ్బుగా ఉన్న పిల్లను పట్టుకొని ఇంతమాట అన్నదే నా బిడ్డను. పీడ వదిలి పోవాలంటుందా! అని ఆ పాద మస్తకం

భగ్గున మండి పోయింది. ఉత్తర క్షణంలో నా ఒళ్లు నాకు తెలియలేదు. గొంతు పిసికి చంపే స్తాను, ఛండాలపు ముండను అంటూ లేచాను. లేచి ఆమెగారు ఉన్న గదివైపుకు నడుస్తున్నాను చీకట్లో. నాకు అడ్డంగా మా ఆవిడ నుంచుని ఉంది. ఆమె కళ్ళవెంట నీరు కారుతూ ఉంది. జుట్టు ముడి జారి ఉంది. ఆమె తన చెయ్యి నోటికి అడ్డంగా పెట్టుకొంది సంజ్ఞా రూపకంగా. ఆమె మాటలు పలక లేదు కాని నాకు ఆమె చెప్ప దలుచు కొన్నదంతా తెలిసింది. "పిల్ల ఆ స్థితిలో ఉండటం ఏమిటి! ఊరుకోండి ప్రస్తుతం ఊరు కోండి పక్కన సత్యం ఉన్నాడు. వాడి ఇంట్లో హత్యగాని అల్లరిగాని జరిగితే వాడి కెంత మనః క్లేశము! వాడు పిల్లలను ఎంత ప్రేమగా చూస్తున్నాడు! వాడ్ని చూచి అయినా ఊరు కోండి" అని స్పష్టంగా చెప్పినట్లు నాకు తోచింది. ఎనిమిది నెలల క్రింద పోయిన ఆవిడ ఆ రోజున మళ్ళీ నాకు సాక్షాత్కరించింది ప్రత్యక్ష రూపంతో. కలలో కాదు!! నేను వెనక్కు తగ్గాను. రుక్కు తల్లికి కూడా కనపడ్డది కాబోలు అప్పుడు. అది "అమ్మా వచ్చావుటే! అమ్మా

వచ్చావుటే? వెళ్ళక; నేను వస్తానండు" అని లేవబోయింది. అదెక్కడి బలమో చివాలున లేచి కూర్చున్నది. నేను పరుగెత్తి కెళ్ళి దానిని పట్టుకొని ఎంతో గింజుకులాడిన తరువాత పడు కొంది అమ్మా నన్ను తీసుకెళ్ళవుటే, నేను వస్తానే! అంటూనే......

నేను మాట్లాడలేక ఊరుకొన్నాను. పిల్లలు ఆ పైన జరిగిన విషయం చెప్పండి అన్నట్లు చూశారు. మాతో పాటు కూర్చున్న స్నేహితు లంతా దుఃఖంతో మౌనంగా ఊరుకొన్నారు. మా పిన్ని చెప్పింది ఆ తరువాత.

*  *  *  *  *

......ఆ స్థితిలోనే ఉందమ్మా పిల్ల. రోగం తిరుగుముఖం పెట్టలేదు. డాక్టర్లు మందులు ఇయ్యటం మానేసి ఇంజెక్షనులు ఇయ్యటం సాగిం చారు. రుక్కు మధ్య మధ్య కొంచెం పిచ్చిగా మాట్లాడినా, చాలాసేపు తెలివిగానే ఉండేది. ఎవరైనా వస్తే గుర్తించేది, చక్కగా మాట్లాడేది. ఇంకొక్క ఒక్క రోజుదాకా ఇట్లాగే ఉంటుందీ,

అప్పుడు ఏదో క్రైసిస్ వస్తుంది! దాని తరువాత కులాసా ఇస్తుందన్నారు డాక్టర్లు.

సత్యం ఇరవై లంకణాలు చేసిన నాడిలాగ కృషించి పోయినాడు. మంచానికి అతుక్కు పోయినాడు. పాపం వాడ్ని చూస్తే నాకు జాలి వేసింది. వాడు చూపిన ప్రేమను భగవంతుడు మెచ్చుతాడు. ఆ దయామయుడు ఈ తల్లిలేని బిడ్డను తప్పక రక్షిస్తాడు అనుకొన్నాను. ప్రార్థనలు పని చేస్తాయి అని అనుకొని మేమంతా ప్రార్థించాము. సత్యం ఈ ఇరవై రోజులు నిరాహారుడై, ఘోర తపస్సు చేశాడు. ఈ తపస్సు ఫలిస్తుంది అనుకొన్నాను.

రుక్కు అయినా మళ్లీ అన్నెర్ర పడలేదు. నేనే అధైర్యపడి ఒకరోజున కళ్ళనీళ్లు పెట్టుకొంటూ ఉంటే, రుక్కుతల్లి నన్ను దగ్గరకు తీసికొని, నా మీద చేతులు వేసి, ముఖం ముఖానికి ఆనించి, "ఇంకా ఏడుస్తా వెందుకు బాపమ్మా! నాకు జ్వరం నయమైంది. ఇహ బాధలేదు" అన్నది. దానికి అట్లా తోచింది కామాలు! ఈ మాటలు

పిని బంగారు తల్లి చెక్కిళ్లను దువ్వి ముద్దు పెట్టు కొన్నాను. అది నవ్వుతూ ఊరుకొంది.

అంత జబ్బులో కూడా అది రోజుకు ఒక సారి పిలిచి, చెక్కిళ్లు దువ్వి "నాయినా అమ్మ ఆజ్ఞను నేను నెరవేర్చాను. అమ్మ నాపై పెట్టిన భారాన్ని నేను నిర్వహించాను. నిన్ను బ్రతికించు కొన్నాను దేవిని ప్రార్థించి" అనేది. రోజుకు ఒక్కసారైనా పిల్లలను పిలిపించి చూశేది. ముఖ్యంగా రాధాయిను చూస్తున్నప్పుడు దాని ముఖంలో తృప్తి ఆనందమూ తాండవిస్తూ ఉండేవి. తన ప్రాణాల బలంతో భర్తను బ్రతి కించు కొనిన సావిత్రి కళ్ళల్లోని తేజస్సు వంటిదే రుక్కు కళ్ళల్లో ప్రకాశించేది. అంత జబ్బులోనూ అది వాడిమీద పంచప్రాణాలు పెట్టుకొనే ఉంది... అని ఆపిడ అనగానే సత్యానికి ఒక విషయం జ్ఞాపకం వచ్చి ఇల్లా చెప్పాడు.

* * * * *

......రుక్కు రాధాయను అంతగా ప్రేమించ టానికి కారణం మీకు తెలుసో తెలియదో నాకు

బాగా తెలుసు. ఒక రోజున అదే నాకు చెప్పింది. అది నాతో స్పష్టంగా చెప్పింది. "మామయ్యా మీకు ఎవ్వరికీ తెలియదు. అమ్మ బాగా తెలివిగానే ఉండంగానే నన్ను పిలిచి నాకు కొన్ని విషయాలు చెప్పింది. రుక్మతల్లి నా మాటలు విను. నీ తల్లి చెప్పే ఆఖరు సందేశం ఇది. బిడ్డలపైన ప్రేమ చూపగలది స్త్రీయేగాని పురుషుడు కాడు. మగవాళ్లా ఇంత సంపాయించగలరు. అంతే! బిడ్డలను ప్రేమతో పెంచటానికి స్త్రీయే కావాలె. స్త్రీ చేసిన త్యాగం పురుషుడు ఎప్పుడూ చేయలేడు. స్త్రీ చూపగల ఓర్పు, సహనము పురుషుడికి తల్లక్రిందుగా తపస్సు చేసినా రాదు. స్త్రీ ప్రేమ స్వరూపిణి. తల్లీ నీవు అల్లాంటి స్త్రీవి కావాలె రెండో సంగతి, శాస్త్రి పాపా, సుశీల విషయమై నాకు దిగులు లేదు. కారణం ఏమో చెప్పలేను. వీడు కడగొట్టు వాడు కావటం చేతనో ఏమో నా ప్రాణాలన్నీ వీడిమీదే ఉన్నాయి. వీడిని కనిపెట్టే భారము ప్రత్యేకంగా ఒకరిపైన పెట్టాలని నాకు తోస్తున్నది. అది భగవత్ప్రేరితము అనుకుంటా.

మీ తాతయ్యా అంటూ ఉండేవాడు. "మన వంశంలో తరతరాలనుంచి ఒక్క కుటుంబమే ఉంటూ ఉన్నది. ఈ కుటుంబం రెండు కుదు ళ్ళుగా ఉన్నది ఎప్పుడూ లేదు. కాంతం, నీ కడుపు ఫలించి ఒక కుదురు రెండు కుదుళ్ళు అయితే నేనూ, చనిపోయిన మీ అత్తయ్యా సంతోషి స్తాము. పైతరాల వాళ్ళుకూడా సంతోషిస్తారు" అని.

నేనూ శ్రీకృష్ణ భగవానుడ్ని ప్రార్థించాను ఈ కోరికను తీర్చుమని. ఆ దయాసింధువు, నా ప్రార్థనలను అంగీకరించి నాకు ఈ బిడ్డను, ఈ రాధాకృష్ణుడ్ని ఇచ్చాడు. ఈ బిడ్డ ఈ విధంగా వరప్రసాద లబ్ధుడు. మన వంశాన్ని వృద్ధి చేయ టానికై పుట్టాడు. అందుకని కూడా వీడిమీద నాకు ప్రత్యేక మమకారం ఏర్పడ్డది. తల్లీ వీడ్ని గురించే నేను ప్రస్తుతం ఆలోచిస్తున్నాను. పిల్లల్లో కల్లా పెద్ద దానవూ, బుద్ధి తెలిసిన దానవూ, గుండె నిబ్బరం కలదానవూ కాబట్టి వీడ్ని నీకు అప్పగిస్తున్నాను. వీడిని నీవు పెంచి పెద్దచెయ్యాలె. వీడ్ని నీ చేతుల్లో పెడితే నా ప్రాణం నిశ్చింతగా

పోతుంది" అన్నది. నేను అశ్రువులతో ఆమె పాదాలు తడిపి పిల్లవాడ్ని తీసుకొన్నాను". ఇల్లా చెప్పింది రుక్కు... అని రుక్కు చెప్పిన మాటలన్నీ మాకు చెప్పి సత్యం తల వంచుకొన్నాడు— అప్పుడు డాక్టరుగారు పిల్లలను చూస్తూ ఇల్లా చెప్పుకొచ్చారు.

* * * * *

......అందుకనే వాడికి అంత చాకిరీ చేసింది తన ఆరోగ్యం సంగతి ఏమీ ఆలోచించకుండా. జబ్బు చేయదు అల్లాగ నిద్రాహారాలు మానితే!! చేసింది. పోనీ ఏదో మామూలుగా పోరాదూ!! మొండికేసింది. అంత కంతకు ఎక్కువైంది. అయితే ఒకటి రెండు పనులు జరగక పోయినట్లు అయితే ఎట్లా ఉండేదో అని పిస్తుంది. మొదటిది టైఫాయిడ్ పేషంటుకు సేవ చేస్తున్నది. కాబట్టి దానికి యాంటీ టైఫాయిడ్ ఇన్ జెక్షన్ ఇవ్వాలిసింది. సత్యం పాపం ఇద్దామనుకుంటూ ఉండగానే జ్వరము తరుము కొచ్చింది! ఏం జేస్తాము! అది ఒకటి.

రెండోది రామారావు డాక్టరుగారు క్వినైను పెద్దడోసు ఇయ్యటం కూడా పొరపాటే!! ఇంతకూ విధి తరుము కొచ్చింది! ఎవ్వరినీ ఏమంటానికీ వీలు లేదు" అని ఊరుకొన్నాడు. పంకజమ్మగారు ఇల్లాగ అన్నది.

*　　*　　*　　*　　*

......ఇందులో ఎవ్వరి బాధ్యతా లేదు. ఎవ్వరు చేసింది ఏమీ లేదు. ఏదో అనుకొంటాం తెలియక!! క్వినైన్ ఇస్తే మటుకు అంత ఎక్కువ కావాలని ఉందా? అసలు విషయం మీ కెవ్వరికీ తెలియదు. మీకు చెప్పలేదు; ఎందుకంటే తెలిసినా మీరు చేసేది ఏమి లేదు కాబట్టి! ఏమిటో ఇప్పుడు చెప్పుతాను వినండి.

ఒక రోజున రాధాయకు ఎక్కువగా జబ్బు చేస్తే రుక్కు దేవిని ప్రార్థించింది అన్నాను చూశారు, ఆ ప్రార్థన ఏమిటో మీకు తెలియదు.

రుక్కు ఆ రోజున అదుర్దాగా పరుగెత్తుతూ ఉంటే, నేను ఆశ్చర్య పోయినాను. దీనికి ఎంత

విశ్వాసం ఉందమ్మా దేవిలోనూ అని. అయినా దేవికి ఏమి మొక్కు కుంటుందో, ఏది కానుకగా ఇస్తా నంటుందో విందామని నేను తలుపు దగ్గరే పొంచుని విన్నాను. తల నీలాలు ఇస్తుందను కొన్నాను. లేకపోతే తన ఒంటిమీద సొమ్ము అంతా ఇస్తాను అంటే అనవచ్చు ననుకొన్నాను. రుక్కు సాహసంచేసి ఇల్లా ప్రార్థించింది. "తల్లి నేను శుక్రవారపు పూజలుచేసి తమ్ముడికి ఆరోగ్యం ఇయ్యమని ప్రార్థించాను! శనివారాలు ఉంటా నన్నాను! వెంకటేశ్వర నీలాలు ఇస్తానన్నాను. నా సొమ్ము అంతా నీ సేవకై వినియోగిస్తా నన్నాను! బంగారపు దేవి విగ్రహాలను ముత్తయి దులకు దానం ఇస్తానన్నాను! నీకు కృప కలుగ లేదు. ఇవి ఏవీ నీకు ప్రీతి అయినవి కావు కామాలు! నిరంతర పూజలచే పవిత్రమైన ఈ దేహాన్ని, నీకే అంకితమైన నా హృదయాన్ని, కూడా అర్పిస్తున్నాను. దేవి నా ప్రాణాలు తీసుకో, తమ్ముణ్ణి బ్రతికించు! నా తమ్ముణ్ణి బ్రతికించు! దానికి ప్రతిగా నా ప్రాణం ఇస్తాను! నా త్యాగాన్ని స్వీకరించు" అని ఇల్లాగ ప్రార్థించింది.

ఇదంతా నేను విన్నాను. అప్పుడు దాన్ని నేను వారించలేక పోయినాను. ఏం జేసేది ఊరు కొన్నాను. దేవి కరుణామయి కదా, ఇంత కఠోర మైన త్యాగాన్ని స్వీకరించదు. రాధాయను బ్రతికించి అంత త్యాగాన్ని చేయటానికి సాహసించిన తన భక్తురాలికి దీవనలు ఇస్తుందను కొన్నాను.

ఇంకో సంగతికూడా ఉన్నది. ఒక రోజున రాత్రి ఒంటి గంట ప్రాంతాల రుక్కు నన్ను దగ్గరకు పిలచి, ఇల్లా అన్నది. "చిన్నిగారూ నాకు ఉత్తరం వచ్చింది. నేను వెళతాను మా అమ్మ దగ్గరకు. దేవి ఆజ్ఞ అయింది" అన్నది. నేను కళ్ళనీళ్లు పెట్టుకొని అమ్మా అల్లా అనబోకు. తప్పు. అధైర్యపడకు. నీకు వచ్చిన భయం ఏమీ లేదు. మీ మామయ్య నిన్న వెయ్యి కళ్ళతో కనిపెడుతున్నాడు. ఇద్దరు డాక్టర్లచేత మందు ఇప్పిస్తున్నారు. భయం లేదమ్మా అన్నాను.

రుక్కు నా మాట వినినట్లు లేదు. అది మళ్ళీ ఇట్లా అన్నది. "చిన్నిగారూ, మామ

య్యాకు నా మీద ఇంత ప్రేమ ఎందుకో తెలుసా? మా నాన్నకు తెలుసు. ఏమిటంటే అది పది నెలలు పండ్లకిందట, నేను మొదటిసారి కళ్లు తెరచి నప్పుడు, ముందుగా చూచింది మా మామయ్యనే! నేను తల్లిగర్భంలోనుంచి మా మామయ్యచేతుల్లో పడ్డానట! అప్పటినుండి మామయ్యకు నామీద ప్రేమ. నాకు మామయ్యమీద ప్రేమ. నేను పసి గుడ్డుగా ఉన్నప్పుడే మామయ్య నన్ను ఎత్తుకొని ఆడించాడు. నాకు ప్రాణాధారమైన అన్నం తినటం నేర్పింది మామయ్యే! ఇదీ సంగతి. నాకు ఒక్క లేకపోక ఉండకమ్మా. మా మయ్యను చూస్తూనే పోవాలని ఉంది."

అయ్యో పిచ్చితల్లీ, ఇల్లాంటి మాటలు అనకమ్మా అల్లాగ అనవొచ్చా? అయితే అల్లాంటి మామయ్యను వదలిపోవాలని అనుకో వచ్చా? అన్నాను. "దేవి, ఆజ్ఞ! నా ప్రాణం కానుకగా ఇచ్చాను!" అన్నది. ఊరుకోతల్లి దేవి మా ప్రార్థనలుకూడా వింటుంది. మేమంతా ప్రార్థిస్తున్నాము నీకు ఆరోగ్యం కలగాలని అన్నాను. రుక్మ తల్లి ఇల్లాగ అన్నది.

"నేను ఉంటే మామయ్య ఇంటికి మాటి మాటికి వస్తూ ఉండటం తప్పదు. అమ్మ కూడా లేదాయె! ఆ ముసలమ్మ ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే. ఆవిడ పెద్ద ఏటూ చేయలేను. ఇహ నాకు పురుడొచ్చినా, పుణ్యం వచ్చినా ఇక్కడికే రావాలె. మామయ్య ఊరు కోడు నేను రాకపోతే. నేను రావటం, మామయ్య నాకు సాహాయ్యం చేయటం, ప్రేమ వర్షించటం ఇవన్నీ జరగకమానవు. ఆ రాజమ్మగారు దుఃఖ పడకామానదు! తద్వారా మా మామయ్య కాపురంలో మొగుడూపెళ్లాలమధ్య మనఃస్పర్ధలూ, ముఖం ముడుచుకోటాలు రాజమ్మగారికి దుఃఖం, ఇవన్నీ వస్తాయి. నేను లేకపోతే ఇవన్నీ ఏవీ ఉండవు. నన్ను చూచినట్లు, ఇతర పిల్లలను మామయ్య చూడడు. చూడవలసిన పరిస్థితులు లేవు. నావలన మామయ్యకు వచ్చే ఇబ్బందులు, ఇతర పిల్లలవలన రావు. వాళ్లు చుట్టపుచూపుగా వచ్చేవాళ్లే! కాబట్టి నేను ఈ లోకంలోనుండి వెళ్లి పోవటం మా మామయ్య భవిష్యత్ జీవిత సౌఖ్యా నికి చాలా అవసరం. నన్ను ఇంత ప్రేమగా చూచిన మామయ్య సౌఖ్యానికై నేను పోవటమే

మంచిదని తోస్తుంది. దేవి ఆజ్ఞప్రకారం ఎట్లాగో పోవాలిసిందే. ఇదికూడా కలిసొస్తుందని సంతోషిస్తున్నా."

ఈ మాటలు వింటూంటే నేను ఏమీ అనలేకపోయినాను. నేను ఏమైనా అన్నా అది విని ంచుకునే స్థితిలో లేదు. ఈ మాటలుకూడా అది ఉహాదావేశంలో అన్నదిగాని మామూలు ధోరణిలో అనలేదు...

అని పంకజమ్మగారు రుక్కు త్యాగాన్ని గురించిన గాధలను చెప్పి ఊరుకొన్నది. పిల్లలు ఏమీ మాట్లాడలేదు. ఇక చివరకు జబ్బు ఎట్లా పరిణమించిందీ వినాలని ఉన్నట్లు చూపులవల్ల తెలియచేశారు. ఆ చివర విషయాలు నేను చెప్తాను.

* * * * *

......ఇర్వై ఒక రోజునకూడా రుక్కు కాస్త తెలివిగానే ఉన్నట్లు నాకు తోచింది. ఎందుకంటే ఆరోజు ప్రొద్దుటిపూట నాతో అది సరిగ్గానే

మాట్లాడింది. అయితే స్వరం నీరసించి హీనపడ్డది. మాటలు తెలివిగానే ఉన్నాయి. నేను దిగులుగా దాని దగ్గర కూర్చుంటే, అది తన రెండు చేతులు నాపై వేసి బుగ్గకు బుగ్గ ఆనించి కాసేపు అట్లాగే ఉంచింది ఏదో ఆనందం అనుభవిస్తూ.

ఆ తరువాత నాతో చెప్పింది "నాన్నా విజ్జయ్య మామయ్యగారు మద్రాసు వెళ్ళుతూఉంటే ఆయనతో చెప్పాను రాధాయకు బూట్సులు, కోటూ, నెక్టైు, హాటూ తెమ్మని. ఆయన తెస్తానన్నాడు. ఆయనకు ఇవ్వమనే నేను నీ వద్ద పది రూపాయలు తీసికొన్నాను. ఆయన ఇంకా రాలేదు నాన్నా! పది రోజులలో వస్తానన్నాడు! అవన్నీ రాధాయకు తొడిగిచూచి ఆనందించాలని ఉంది నాన్నా" అని చెప్పింది. తల్లి పది రూపాయలూ, తనకోసం కాక రాధాయకోసం తీసుకొన్నదే అని ఆశ్చర్యం కలిగింది. ఆ రోజునకూడా పిల్లలను పేరు పేరునా పిలిచి కన్నీళ్ళతో చూచింది.

పిల్ల ఇట్లాగ మాట్లాడుతున్నా, వాళ్ళిద్దరూ ఎందుకో దిగులు ముఖాలతో తిరిగారు. ఎవరు

ఏమీ మాట్లాడక, విచారంగా, ఏమిటో, ఎక్కడో, దేనో చూస్తూఉన్నట్లు కనిపించారు.

వీరరాఘవస్వామిగారు వచ్చి అభిషేకాలు చేయిస్తే మంచిదన్నారు. వెంటనే ఇద్దరు సద్బ్రాహ్మణులను పిలిపించి కావలసిన వస్తువులు ఇచ్చి శివాలయానికి పంపాను. రామమూర్తిగారు అన్నారు, రమణమహర్షికి తంతి పంపండి. ఆయన నీవసలు పంపుతావూ అని. ప్రిపెయిడ్ తంతి పంపాము. హరినాథ బాబును ధ్యానించాము. శాయీనీ ప్రార్థించాము నా కుమార్తెను రక్షించమని. కన్నకన్న దేవుళ్లకూ మొక్కాము ముడుపులు గట్టాము.

డాక్టరు దక్షిణామూర్తిగారి దగ్గర నవరత్న చింతామణి ఉందని తెలిసింది. అది దివ్యమైన ఆయుర్వేదౌషధము. దానికై పంపించి తెప్పించాము.

ఏంరా, ఇది రుక్కుకు వేయమంటావా? ఇంగ్లీషు మందులకూ దీనికీ ఏమీ విరోధం లేదు కదా? అని అడిగాను సత్యాన్ని. వాడు మాట్లా

డక తల ఊపాడు ఇష్టాన్ని తెలియ పరుస్తూ. నేనే ఆ మందు దాని నాలుకకు కాస్త రాచాను.

ఆ మందు సాయంత్రం మూడు గంటలకు వాడాము. అందరి గుండెల్లో రాయిపడ్డది. అందరం మౌనంగా ఉన్నాము ఏమిరా భగవంతుడా అని!

ఒక్క రాజమ్మగారుమటుకు ఆ రోజున కూతురికి తలంటిపోసుకొని, వంటింటి గుమ్మంలో కూర్చుని, తలదువ్వి పూలు పెడుతున్నది.

బ్రాహ్మణులు అభిషేక జలాన్ని తీసుకొని వచ్చి, రుక్కు శిరస్సుపై చల్లి, దీవించి ప్రసాదం కూడా అక్కడ పెట్టిపోయినారు. రమణ మహర్షి దీవెనలు ఎందుచేతనో రాలేదు. వేదాంతం లక్ష్మీ నారాయణగారు వచ్చారు. వారు కుంభకోణంలో ఉన్న ఒక గురువుగారి శిష్యులట! వారు చాలా సత్పురుషులు. నవనీత హృదయులు. దీనజనుల ప్రార్థనలూ, కోరికలూ ఆయనకు ఎవ్వరూ చెప్పకుండానే తెలుస్తాయి. పిలవకుండానే ఆయన మా ఇంటికి వచ్చాడు రామమూర్తిగారిని వెంటబెట్టు

కొని. పిల్లకు ఇరుపార్శ్వములా ఇద్దరూ నుంచుని రుక్కు శిరోపరిభాగాన అభయహస్తాలు ఎత్తిపట్టి అరగంటసేపు ప్రార్థనచేశారు. “మరేం ఫరవాలేదు నీ బిడ్డకు. మళ్లీ రేపు వస్తాము” అని నాకు ధైర్యంచెప్పి వాళ్లిద్దరూ వెళ్లారు.

నవరత్న చింతామణి ఇచ్చిన గంటకు రుక్కుకు తెలివి వచ్చింది. కళ్లు విప్పిచూచింది. అందరినీ గుర్తించింది. మామయ్యా, నాకు కొబ్బరి కాయ నీళ్లు తాగాలనిఉంది అన్నది. వాడు వెంటనే బజారుకు మనిషిని పనుగత్తించి గంగా ఫలం తెప్పించాడు. అమ్మాయి ఆప్యాయంగా ఆ నీళ్లు త్రాగింది. తృప్తి దాని ముఖంలో తాండవించింది.

అమ్మాయి మళ్ళీ తెలివిగా నవ్వి మామయ్యకు కృతజ్ఞత తెలియజేస్తూ నమస్కరించింది. అందరినీ పలకరించి, మామూలు మనిషిలా క్షేమ సమాచారాలు అడిగింది. తమ్ముళ్ళను సుశీని దగ్గరకు తీసుకొని ముద్దాడి పంపింది. అత్తయ్య వస్తే, ఆమెను చూచి నవ్వి, “అత్తయ్యా నీ

మెళ్లో ఉన్నవే అల్లాంటి పెద్ద మంగళ సూత్రాలు నేను కూడా చేయించు కొంటాను" అన్నది.

రుక్కుకు బాగా తెలివి వచ్చిందని అంతా అనుకొంటే విని కాబ్బోలు, రాజమ్మగారు కూడా వచ్చింది చూడటానికి. రుక్కు ఆవిడను చూచింది. ఆవిడ దాని లేత హృదయంలో శూలాలు గుచ్చింది. అవన్నీ దానికి జ్ఞాపకానికి వస్తాయి. ఈ ఒక్క విషయం జరగకుండా ఉన్నట్లు అయితే, రుక్కు ఈ లోకాన్ని గురించి అనుకునే సంగతులలో కష్టం కలిగించేది లేదు. మృదువైన గులాబి పత్రాలకు ముళ్ళు తాకిడి ఉన్నట్లు, రుక్కు నవనీత హృదయానికి ఈమె కంటక ప్రాయమైంది, అని మేమంతా అనుకున్నాము. రుక్కు మాత్రం రాజమ్మగారిని దగ్గరకు రమ్మని సంజ్ఞ చేసి, "బామ్మా ఈ భూమిమీద నున్న నాలుగు రోజులూ మన దగ్గరకు వచ్చిన వాళ్లను కొద్దిగానైనా సంతోష పెట్టటానికి మార్గం ఉందా అని కాస్త ఆలోచించు. చెట్టు అటువంటిది తన్ను చేరిన వాళ్లకు నీడ నిస్తుంది!" అని నమస్కరించింది. ఆవిడ తెల్లపోయి దిగాలపడి చూచింది.

ఆయుర్వేదౌషధము అమృతంలాగ పనిచేసింది. రోగం తిరుగుముఖం పెట్టింది అనుకొన్నాను... అప్పుడు మా పిన్ని అందుకొని రెండు మూడు విషయాలు చెప్పింది.

*    *    *    *    *

......నేనూ అల్లాగే అనుకొన్నాను. నిజంగా ఆ తరువాత చాలాసేపు తెలివిగా ఉంది. ఆ రోజున ఏమైంది అనుకొన్నావు! రాత్రి పన్నెండు అయింది. నేను రుక్కును చూస్తూ కూర్చున్నాను. అప్పుడే దానికి కాస్త కునుకు పట్టింది. నేను విసురుతూ కూర్చున్నాను.

ఇంతలో అది హఠాత్తుగా లేచిపోయింది. నేను పట్టుకొని పడుకోబెట్టి ఎందుకు తల్లీ లేస్తావు? నీవు లేవగలవా? పడుకో తల్లీ అన్నాను అమ్మాయి నా వంకజూచి, బామ్మా ఒక్కమాట అన్నది. నేను దాని దగ్గరకు జరిగి ముఖంమీద ముఖం పెట్టాను. అది ఏదో చెప్పటానికి ప్రయత్నించి అతి కష్టంమీద అన్నది. "బామ్మా రాజమ్మ బామ్మా"......అని ఆగింది. ఏమిటి

తల్లీ అన్నాను. "ఆ గదితలుపు వేశెయ్యి" అన్నది. ఆ గదిలో ఆ సమయానికే రాజమ్మగారు సత్యంతో ఏదో గుసగుస లాడుతున్నది. నేను వేసి వచ్చి, వేశాను తల్లీ. ఏమిటమ్మా? ఆ అమ్మ సంగతి ఏమిటమ్మా? తల్లీ, రుక్కుతల్లీ? చెప్పు అమ్మా? ఏమిటి నీవు చెప్పబోయినావు? అమ్మా రుక్కూ, ఏమిటి తల్లీ? ఏమిటి అమ్మా. 'రాజమ్మ బొమ్మ' అది ఏదో చెప్పబోయినావు! చెప్పు అమ్మా? అని ఎంత బ్రతిమిలాడినా అమ్మ విని పించుకో లేదు. మాట్లాడ లేదు. చెప్పాలను కొన్నది చెప్పనే లేదు. చెప్పలేకే పోయింది.

... చెంతను దాటిన దగ్గరనుంచీ మళ్ళీ మగత చూపులు వచ్చె. 'వనజాసుత' అనే కీర్తన పాడింది. తన తల్లి అక్కడ ఉన్నట్లు మాట్లాడింది. మళ్ళీ ఇదేమిటర్రా అన్నాను నేను సత్యంతో. "అం తేమరి! ఇందాకటి సుగుణమంతా నవరత్న చింతామణి పని! దాని బలం తగ్గింది" అన్నాడు వాడు. దాని తరువాత సంగతి ఏముంది నాయినా అని మా పిన్ని ముఖాన గుడ్డ అడ్డం పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. ఆమె ఆ స్థితిలో ఉండగానే

నేను మిగిలిన సంగతి చెప్పాను. విషయం పూర్తి కావటానికి.

*　　*　　*　　*　　*

......నేనూ సత్యం మంచానికి చెరో పక్కగా కూర్చున్నాం. మా పిన్ని గడపలో కూర్చుంది. పంకజమ్మగారు గది అవతల కూర్చున్నది. నేనూ సత్యం దానికి దగ్గరగా ఉన్నాము. రాత్రి రెండుగంట లకు దాని కాళ్లూ చేతులూ చల్లబడుతూ ఉన్నట్లు అనుమానం కలిగింది. నేను ముట్టుకు చూచి దిగులుగా వాడివంక చూశాను. వాడు కాళ్లూ చేతులూ తాకి చూచి నా వంక చూశాడు దిగులుగా.

నా గుండె పగలాలిసిందే! కాని నాకు గుండెలేదు పగలటానికి! నాయినా సత్యం, ఏమిటి? అన్నాను. వాడు మంచం పెట్టెకు తల ఆనించి వెక్కి వెక్కి ఏడ్చాడు! నాయినా ఇంకా ఆశలేదా? అన్నాను. ఆశలేదు అంటానికి వీలులేదు. క్రైసిస్ వచ్చింది. నిమోనియా డిసాల్వు అవుతున్నది. బతికొచ్చు. మన అదృష్టం ఎట్లాగున్నదో! అని ఏడుస్తూ చెప్పాడు.

బ్రతకవచ్చును అనేమాట ఏదో ధైర్యాన్ని ఇచ్చింది. నా తల్లి బ్రతుకుతుంది అని పించింది. ఎంతమందో అల్లాంటి స్థితిలోకి వచ్చికూడా బ్రతికారు. ఇదీ ఇల్లాగే బ్రతుకుతుంది అనుకొన్నాను.

హుమాయూన్ యువరాజుకు ప్రబలమైన జబ్బుచేసి ఆశలు వదలుకొన్నప్పుడు తండ్రి బేబరు కుమారుని మంచం చుట్టూ ముమ్మారు తిరిగి "నా ప్రాణం తీసుకొని, నా కుమారుని బ్రతికించు ప్రభూ" అని దేవుని ప్రార్థించాడనీ, ఆ తరువాత హుమాయూనుకు ఆరోగ్యం కలిగి, బేబరు పాదుషా జబ్బుపడి చనిపోయినాడనీ చరిత్రలో చదివిన విషయం జ్ఞాపకానికి వచ్చింది.

నేను వెంటనే అమ్మాయి మంచంచుట్టూ మూడు అయిదులు పదహేను సార్లు తిరిగి, ఓ భగవంతుడా, ప్రభూ, దీనరక్షకా నా ప్రాణం తీసుకో. నా కుమార్తెను బ్రతికించు, అని హృదయం ఇవ్వగల బలాన్ని అంతా వినియోగించి నిశ్చలమైన భక్తితో ప్రార్థించాను. మొసలి తన అంపపు పళ్ళతో బాధ పెట్టుతూ ఉంటే భగవంతుడ్ని

ప్రార్థించిన గంజేంమర్రిపు సహితం అంత కంటే తీవ్రమైన భక్తితో ప్రార్థనచేసి ఉండను.

కాని ప్రభువు నా ప్రార్థనను అంగీకరించ లేదు. పసిపిల్ల ప్రాణానికే ఆశపడ్డాడు. పిల్ల అంత కంతకు జారిపోతున్నది. నేను ఎంత ఏడిస్తే ఏమి లాభం, స్వామి కరుణించక పోయిన తరువాత.

ప్రభువు, దయాసింధువు కాడు. కఠినుడు, పాషాణ హృదయుడు. వజ్రహృదయుడు. నా ప్రార్థన లేవీ వినలేదు. దానినే పట్టుకొన్నాడు.

రుక్కుకు నాలుగు గంటలకు మళ్ళీ ఒక్క సారి తెలివి వచ్చింది. హీన స్వరంతో "బావ" అన్నమాట అని అటూ ఇటూ చూచింది. దానికి కావలసిన వాళ్లు, తమ్ముళ్లు, చెల్లెళ్లు, బా అమ్మ మామయ్యా. అంతా అక్కడ కనపడ్డారు కాని ఒక్క అల్లుడు మాత్రం కనపడలేదు. తల్లి విచార పడి ఉంటుంది. ఆయనకు టెలిగ్రాం అంతకు పూర్వపు రోజే ఇచ్చాము. ఆయన పల్లెటూరిలో ఉండటంవల్ల సరిగ్గా అంద లేదేమో!! ఆయన మాత్రం రాలేదు.

ఇంకో అరగంట గడిచింది. ఇంకేముంది తల్లి కళ్లు తిప్పేస్తున్నది. భోరు భోరున ఏడ్చాను. ఒక్క గంతులో వంట ఇంట్లోకి పరుగెత్తుకెళ్లి, అమ్మాయి రోజూ పూజించే దేవి విగ్రహం ముందు నుంచుని "తల్లీ, అమ్మ చేసిన అపరాధం ఏమిటి? నిన్ను భక్తితో పూజించింది. ఏమిలోపం జరిగింది తల్లీ? రుక్కును బ్రతికించు అమ్మా! నీ కృపామృత వృష్టిచే నా బిడ్డను బ్రతికించు. అంబా, జగన్మాతా, తల్లీ, రక్షించు" అని గుండె పగిలేటట్టు అరిచాను. దేవి విగ్రహంలో చైతన్యం గోచరించింది. ఆ జగన్మాత కన్నులలో అశ్రువులు మిణుకు మిణుకు మన్నై. ఆమె ముఖం తిప్పుకొంది.

మళ్ళీ అమ్మాయి గదిలోకి పరుగెత్తుకొని వచ్చాను. ఇంతలో రాజమ్మగారు అల్లుడి సాయంతో అమ్మను చాప మీదికి దించేసింది. చివరకు ఆమె అమ్మాయికి చేసిన సాయం అది. తల్లికి ఎక్కిళ్లు పుట్టినై.

తెల తెల వారుతూ ఉంది. సూర్యుడు ఆ రోజున తొందరగా పరుగెత్తుకొని వచ్చాడు.

రుక్కుతల్లిని, ఈ లోకంలో ఉండగానే, ఒక్క సారి చూద్దామని! పగలంతా రుక్కు దగ్గరే ఉండి సాయంత్రం రుక్కును వదలలేక వదలలేక వచ్చి ముఖం కందగడ్డ చేసుకొని వెళ్ళిపోయినాడు. బంధువులు అంతా వచ్చారు. మా చెల్లెళ్ళు, మా బావలు మిగిలిన వాళ్లు అంతా వచ్చారు. రుక్కుకు ఒక్కసారి, ఆఖరుసారి కళ్లల్లోకి తెలివి వచ్చింది. రుక్కుతల్లి కళ్లు తిప్పి నాలుగు దిక్కులా చూచింది.

అందరినీ గుర్తించింది. ఆత్మత్యాగం చేసినందువల్ల కలిగే తృప్తీ ఆనందమూ దాని కళ్లల్లో ప్రకాశించింది. అందరినీ చూచి అందరివద్దా సెలవు పుచ్చుకొంది చూపులతోనే.

రాత్రి పది దాటి నప్పటినుండి దాని చూపులు మళ్ళీ మారిపోయినై. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు దీర్ఘములు కఠినములు అయినై. నేను అమ్మాయిని ఒడిలోకి తీసుకొన్నాను. దానికి తృప్తి కలుగలేదని తోచింది. సత్యం దాని తల తన తొడపై పెట్టుకొని కళ్లల్లోకి చూశాడు.

నేనూ చూస్తునే ఉన్నాను. మామయ్య ముఖం లోకిచూస్తూ కళ్లల్లో కళ్ళు కలుపుకొని అమ్మాయి నిశ్చింతగా పడుకొన్నది.

నేను తల్లీ ఒక్కసారి నా వంక చూడమ్మా, ఒక్కమాట చెప్పవే అమ్మా, తమ్ముళ్లూ, వాళ్లూ, ఏడుస్తున్నారే అమ్మా! ఇది నీకు న్యాయమే నా తల్లీ! అందరిని వదిలి పోతావా అమ్మా! నీకో రెండు జరీచీరలు తెచ్చానే తల్లీ! వాటిని ఏంజేయ మంటావు? తల్లీ! శాస్త్రి, సుశీ, రాధా, పాపా అంతా ఏడుస్తూ ఉంటే వెళ్ళి పోతావా అమ్మాయీ? బిడ్డా శామ్మతో ఏదో ఒకమాట చెప్పాలని అనుకొని చెప్పలేక పోయినావు! ఆ మాట ఏమిటో చెప్పు తల్లీ? నిన్ను ఎవరేమి కఠినపు మాటలన్నారే తల్లీ? ఉత్తరం, ఉత్తరం అన్నావు, భగవంతుని దగ్గరనుంచి ఉత్తరమా అమ్మాయీ? నీవు రోజులు లేవునాన్నా అన్నావు, ఇదా అర్థం అమ్మాయీ? రుక్కుతల్లీ, నీ కడుపులో ఇంత ఊహ పెట్టుకొన్నావని నేను అనుకోలేదమ్మా! పడుకో తల్లీ అంటే ఇహ పడుకొంటా నన్నావు! నన్ను దౌర్భాగ్యుడ్ని చేసి పోతు

న్నావా? ఆ రేండ్లు పాటు చెప్పించిన సంగీతమంతా రెండు రోజుల్లో పాడి పోతున్నావా? బాధలేదు, జ్వరం పోయింది అన్నావు, ఇదా బాధ లేక పోవటం! అయ్యో! నా తల్లీ! అమ్మా! బిడ్డా! అమ్మాయీ! మాట్లాడవా? ఇక ఈ పాపితో మాట్లాడవా? వద్దు వద్దు అంటే వినక తమ్ముడికి సేవచేసి వాడికోసం నీవు ఇంత త్యాగం చేస్తావా అమ్మా! అమ్మా! అమ్మాయీ! రుక్కుతల్లీ! అని ఎంత ఏడ్చినా, గుండె బాదుకొన్నా, అమ్మ పలక లేదు.

అప్పుడు వచ్చాడు విజ్జయ్యగారు మద్రాసు రైలుదిగి రాథాయి కోసం కొనమన్న వస్తువులు తీసుకొని. అవి రాధాయకు తోడి చూచి సంతోషించ కుండానే అమ్మ పోతున్నది. అమ్మకు ఈ కోరిక తీరలేదు. అప్పుడు వచ్చాడు అల్లుడు ఉదు కాల పరుగులమీద! ఏం లాభం! రుక్కు బావ కోసం దిక్కులు చూచింది. గాజు చూపులతోనే వెతుకుకున్నది. కడసారి భర్తను చూడటానికి

దానికి ప్రాప్తం లేకపోయింది.

మామయ్య తొడపైన తల పెట్టుకొని పడుకొంది. రాఘిగాడు దాని బొమ్మపై బడి ఏడుస్తున్నాడు అక్కయ్యా అంటూ. అది మామయ్యనే నమ్ముకొంది. మామయ్య దేముడను కొంది. మామయ్య చేతుల్లోనే అది పుట్టింది. ఇప్పుడది మామయ్య చేతుల్లోనే ఉంది. రాత్రి పదకొండు దాటింద అప్పటికి.

ముసలమ్మ నారాయణ స్మరణ చేసింది. మా చెల్లెలు దాని నోట్లో తులసి తీర్థం పోసింది. సర్వం నెలరోజులు చేసిన ఘోరతపస్సు అంతా వృథా అయిపోయింది. తల్లి వెళ్లి పోతున్నది వాడి చేతుల్లో, వాడి కళ్లల్లో కళ్లు పెట్టుకొని !! రమణమహర్షి దీవనలు అమ్మకు అందలేదు. అమ్మ పోయిన తరువాత ఎందుకూ ఈ దీవనలు!! వీర రాఘవస్వామిగారు చెప్పినట్లు అభిషేకాలు చేయించాను. ఏ లాభం! అమ్మ పోతున్నది! దక్షిణామూర్తిగారి నవరత్న చింతామణి అమ్మాయికి ప్రాణం పోయలేదు! భగవంతుడు నా ప్రార్థనలను

వినలేదు, నేను పాపిని కాబట్టి. పోనీ ఆ సత్ పురుషుడు లక్ష్మీనారాయణ గారి ప్రార్థనలన్నా వినకూడదా? వినలేదు! అమ్మ అప్పుడే ఊర్ధ్వ లోకాలు చూస్తున్నది. అమ్మ పోతున్నది! రామారావుగారు దానికి చిన్నతనంలో ఒకసారి, రెండు రూపాయలు చేతిలో పెట్టి దీవించారు. ఆ దీవన ఫలించకూడదా? శివరామ కృష్ణయ్యగారు, పట్టాభి రామయ్యగారు వీరంతా రుక్కుతల్లిని దీవించారు. వారి దీవనలు కూడా వృధా అయి పోతవా? ఏమి ఖర్మమో! వృధా అయిపోయినై! అమ్మ స్వర్గలోకాలను చూస్తున్నది! చిన్నప్పుడు దీనికి రుక్కుతల్లి అని పేరుపెట్టిన కేశవరావు మనః పూర్వకంగా అమ్మాయిని దీవించాడే! ఆ ఆశీ స్సుకూ బలం లేకపోవాలా! అమ్మాయికి పద్యం చదవడం నేర్పిన పువ్వాడ దాన్ని మనసార దీవిం చాడే! అదీ వృధా కావాలా! ఏ దీవనా పని చేయలేదు! ఏ మందు పనిచేయలేదు! అమ్మ కష్ట పడి ఊపిరి విడుస్తున్నది! పోతున్నది! పోతున్నది! నా కడుపులో ఈ జన్మకు ఆరని చిచ్చుపెట్టి పోతు న్నదీ! తల్లి పోతున్నది! రుక్కు పోతున్నది! మా అమ్మ పోతున్నది! నా బిడ్డ పోతున్నది!

అయ్యో! అమ్మ పోతున్నది!! అని ఎంత ఏడ్చినా ఎంత మందిని ప్రార్థించినా, ఎన్ని దేవుళ్ళకు మొక్కినా లాభం లేకపోయింది. ఒక్క దీర్ఘ నిశ్వాసం విడిచి, సత్యం చేతుల్లో నే, నేనూ చూస్తూ ఉండగానే రుక్కుతల్లి పోయింది. అమ్మ కట్టుకొంటే చూచి సంతోషిద్దామని తెచ్చిన రెండు జరీ చీరలూ దానిపైన కప్పి అమ్మను పంపేశాను. ఇదీకథ !! ...... అని నేను కన్నీళ్లు కాదుస్తూ తల వంచుకొన్నాను. ఇంతవరకూ వింటూ ఉన్న పిల్లలూ, ముసలమ్మా, డాక్టరుగారూ, పంకజమ్మ గారూ అంతా ఏడ్చారు. అది రుక్కు చనిపోయిన రోజు. అందుకని దాని ఫోటోముందు కూర్చొని ఆ విధంగా దాని కథ చెప్పుకొన్నాము. మా అశ్రుధారలతో దానికి తర్పణం వదిలాము... నేను ఓవ్వరకు మళ్ళీ ఇల్లాగే అన్నాను తలవంచుకొని.

* * * * *

రుక్కుతల్లి ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయి ఇప్పటికి అయిదేండ్లు అయింది. పిడుగు పాటుచేత కొమ్మలన్నీ అంతా కాలి చిల్లులు పడ్డా ఇంకా తలఎత్తుకొని ఉండే తాటి చెట్టులాగ నేనూ ఉన్నాను

ఉండటం. అది స్వర్గలోకాలకు వెళ్ళిపోయింది. భూమిమీద ఉన్నన్నాళ్ళూ అది ఒక దివ్యజ్యోతి. తీయని మాటలు, ప్రేమను వర్షించే చూపులు, అందరికీ నేర్పిపోయింది. రుక్కు అంటే, తమ్ముడికోసం ప్రాణం అర్పించిన త్యాగశీలకాదూ అని అందరిచేత అనిపించుకొంది.

ఎవరైనా, ఇంతపరాకా అని పాడుతూ ఉంటే రుక్కే, త్యాగశీల చిరస్మరణీయ కాదా! నన్ను మరిచి పోయినారా అని లోకంతో చెబుతున్నట్లు ఉంటుంది.

ఉరుము భయంకరంగా ఉరిమి నపుడు, రుక్కు ఆ రోజున ప్రయాణమై వెళ్ళినపుడు ఇల్లాగే ఉరిమింది అని జ్ఞాపకానికి వస్తుంది.

బిడ్డలు కన్నతల్లుల్లారా! మీరు పదిమంది చేరి మాట్లాడు కొంటున్నపుడు రుక్కుతల్లి పేరొక సారి తలవండి. బుద్ధి తెలిసిన ఏ పిల్ల అయినా తమ్ముళ్ళను, చెల్లెళ్ళను ప్రేమతో చూడకపోతే రుక్కు కథ చెప్పండి......

అప్పటికి చాలా ప్రొద్దుపోయింది. లైట్లు ఆరిపోయినై. దూరాన దివాణంలో కొట్టిన గంటలు ఎక్కడ నుంచో, మరో లోకాన్నుంచి, వస్తున్నట్లు వినిపించినై.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 0 129131773 |
| పుస్తకం పేరు | [illegible] 0 |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 145 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 8, 132 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |